# చైతన్యకవిత

**4**

ప్రభవ శరత్తు

AUTUMN 1987




సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం





చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
October 1987, pp. xii + 64.

ముఖచిత్రం : పండిత ప్రపంచంలో శేషభోగి, రస మహాసముద్రంలో శేషశాయి, సహృదయ లోకంలో శేషజ్యోత్స్న, కావ్య నందన వనంలో శేషేంద్రశర్మ.
Paul Konyiomtzis (గ్రీకు చిత్రకారుడు) చిత్రానికి శ్రీ గోలి శివరాం ప్రతికృతి.

అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి

వెల : రూ. 8-00 (వార్షిక సభ్యత్వం రూ: 10-00; ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00; జీవిత సభ్యత్వం రూ. 200-00)

*For Copies* :

**Dr. T. V. Subba Rao**
Head, Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
I.K.S., University of Mysore,
Manasagangotri, Mysore-570 006

ముద్రణ : మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8.

# Seshendra

## In Delphi

*Here the sea is caught*
*between the mountains*
*and the wind in the olives......*
*The bird suspended in the*
*sky of joy*
*for a moment like eternity-*
*Hear where the gods walk on the hills*
*with their mighty legs*
*set like temple columns-*
*We trecked our way, my friends,*
*into a myth, the breath of time,*
*which whispered in our ears*
*fables of the Earth's childhood......*

*We walked on ruins*
*which are stones and stories*
*today !*
*A poem flows down the cliffs*
*of my mind*
*I allowed her to flow,*
*to flow so slowly and softly*
*that my life*
*may not ebb away—*

(ఇటీవల గ్రీసుదేశంలో పర్యటించిన సందర్భంగా
శేషేంద్ర శర్మగారు ఇంగ్లీషులో రచించిన కవిత)

"నా కవిత్వం మనిషికి కేవలం ఒక డిఫెన్సు"

"ఇల్లు లేనివాడు ఆకాశ క్రౌర్యానికి గురి
భూమిలేనివాడు ఆకలి కోరలకు బలి
మరణించే లోపుగా తన మాట చెప్పలేని
నిస్సహాయ మానవుడి గొంతు పేరే కవి"

"ఈ ఏడాది పైర్ల దుఃఖం తీరకపోతే
వచ్చే ఏడాది వట్టి కొడవళ్ళు పట్టుకున్న
పిడికిళ్ళే మొలుస్తాయి"

"నదులు కవులు భూగోళపు రక్తనాళాలు"

"ప్రేమను గురించి ఉపమానాలు పేనుతుంటే
గుండెని కోకిల తన్నుకు పోయింది
గజల్ని గురించి రాద్దామని కూర్చుంటే
రాత్రి కవిత్వంలో తడిసి పోయింది"

"పక్షి వాలే వృక్ష శాఖే
కవి కంటికి విమానాశ్రయం"

"ప్రభాత పుష్పాలు రంగుల్లో
స్నానం చేస్తున్న నిశ్శబ్ద దేవతలు"

"కోర్కెల చంద్రమండలం మీద ఎవరు అడుగుపెట్టారు
ఆకలి సముద్రాలకు ఎవరు అనకట్ట కట్టారు
నేను నిద్రకోల్పోయిన రాత్రులే నాగరకతలు
నా కన్నులమీద వాలిన సీతాకోక చిలుకలే కవితలు"

—శేషేంద్ర

# సూర్యుని జన్మదినం

—తంగిరాల సుబ్బారావు

భూమికి జన్మదినం విరగబండిన పంట చేను
సముద్రానికి జన్మదినం నిండు పున్నమి వెన్నెల
అగ్నికి జన్మదినం మెరుపులు ఉమిసే పిడుగు
గాలికి జన్మదినం అడవి చెట్లను కరకర నమిలే తుఫాను
ఆకాశానికి జన్మదినం అప్పుడే ఉదయిస్తున్న సూర్యుడు
మరి ఆ బాలభానుని జన్మదినం?
అరుణకిరణాల అక్షరాల్ని జుర్రే
కై పెక్కిన తరుణలోకం కన్నుల కెందామరలు!

ఓ మంటల భాస్కరుడా!
నువ్వు పంటలు కోసే కొడవళ్ల కన్నీళ్లు తుడిచావు
వెన్నెల త్రాగే చకోరాల కిలకిలలు విని పులకించావు
మబ్బుల్లో పరుగెత్తే పిడుగుల గర్జనలు ప్రతిధ్వనించావు
నిట్టూర్పుల తుఫానుల్ని ఓదార్చావు
నీ ఒడిలో సేద తీర్చావు
శిఖరాల మీద సూర్యుడు నాటిన ఎర్రజెండాల ముందు
మానవతా జాతీయ గీతాలు ఆలపించావు
ప్రభవనుంచి అక్షయంలోకి ప్రవహించే కాలచుతు చక్రంలో
పిట్టల పాటలు వెలిగించిన చెట్లమీది వసంతాలు తిలకించావు!

ఓ కావ్య ఫణీంద్రా!
నిత్యం నీ నాలుక గున్నమామిడి మీద వాలే వాల్మీకి కోకిలగానం
మెట్లుమెట్లుగా పైకి ఆనంద శిఖరాలకు........
విషాద ధూమంగా క్రమ్ముతూ నీ గుండెను పట్టి పిండుతూ
అశోకవనాన్ని చీల్చుకొని వచ్చే జానకీశోకం
బొట్లు బొట్లుగా క్రిందికి తమస్సుల అఖాతంలోకి........

ఎదురుగా
విధుర విషాద గీతాల్ని అణిచి వేసే
కన్నుల మిరుమిట్లు గొలిపే సౌందర్యకాంతి!
మనసుకు మయూర నృత్యాల శాంతి!
రంగురంగుల కలల బ్రష్షునీ ప్రతిభారక్తంలో ముంచి
ఈ జనతా హృదయ చిత్రాలకు మెరుగులు దిద్దుతావు
మా మీద ఇంద్రధనుస్సుల పంచిళ్లు పరుస్తావు
ఇంద్రజాల మహేంద్ర జాలాలతో మెస్మరైజ్ చేస్తావు........
కవితా రసధునిలో పడి
కరిగి పోయిన ఓ వెండి జాబిల్లీ!
ఒకే సమయంలో నీలో చూస్తాను ద్వంద్వాలు
అమృతం–విషం,
అగ్ని–హిమం,
షాంపేన్–నాటుసారా,
సుఖదుఃఖాలు,
మరుజువానా–స్పెషల్ చ్యవనప్రాస
హిరాయిన్–మహా కనక సిందూర భస్మం
క్లోరోఫిల్ చచ్చిన ఎండుగడ్డి కవితకు
కాయకల్ప చికిత్స చేసిన అపర ధన్వంతరివి
మూర్ఛ పోయిన లక్ష్మన్న పాలిటి సంజీవ రాయడివి.

విస్సన్న చెప్పింది వేదం–అది వెర్డిక్ట్!
నీ గొంతుకకు నేను ఎడిక్ట్!
రాముడు, కృష్ణుడు, రామకృష్ణుడు గురు గౌరిశంకర శిఖరాలు
హనుమంతుడు అర్జునుడు నరేంద్రుడు శిష్యత్రిశూలాలు
విశ్వనాథకు జువ్వాడి గౌతమ్....
ఓ మండే సూర్యుడా!
నీ వెలుగు ముందు
నేనూ నా చీకటీ
ఖతమ్!
ఇది
నీకు అంకితమ్!!

# శారద ప్రాభవం

ఈ ప్రభవ శరత్సంచిక వెలువడే సమయానికే శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు కాలచక్రంలో అరవై సంవత్సరాలు గడపడం అనుకోని సంఘటనే అయినా సంతోషాన్ని కలిగిస్తోంది. అందులోనూ ఈ సంవత్సరం ప్రభవ కావడం మరో విశేషం. శారద ప్రాభవానికి శేషజ్యోత్స్న తోడయింది.

ఇటీవలే (జూలై-అగస్టు, 1987) శేషేంద్ర శర్మగారు తమ పత్ని శ్రీమతి ఇందిరాదేవి ధనరాజగిర్‌తో బాటు గ్రీసు దేశంలో పర్యటించి వచ్చారు. ఏథెన్స్‌కు సుమారు 150 మైళ్ళ దూరంలో ఉన్న డెల్ఫిలో ప్రాచీన గ్రీకు నాటకాన్ని గూర్చిన మూడవ అంతర్జాతీయ సదస్సు జరిగింది. ఆ సదస్సుకు శర్మగారిని ఆహ్వానించారు. శర్మగారు ప్రాచీన భారతీయ నాటకాన్ని గ్రీకు నాటకంతో పోల్చి చూపే పరిశోధన పత్రాన్ని సమర్పించి విద్వాంసుల ప్రశంసల నందుకున్నారు. ఇటలి, స్పెయిన్, ఫ్రాన్స్, బ్రిటన్, చైనా, అమెరికా, సోవియట్ యూనియన్ మొదలైన దేశాలనుంచి వెళ్ళిన 30 మంది ఆహ్వానితుల్లో భారతదేశానిక ప్రతినిధి శేషేంద్రగారు.

ముఖ్యంగా కవి మిత్రులకు సంతోషం కలిగించే విషయం ఏమిటంటే శర్మగారి 'నా దేశం-నా ప్రజలు' మహాకావ్యాన్ని గ్రీకు కవయిత్రి జార్జియా అలెక్సియో గ్రీకు భాషలోకి అనువాదం చేశారు. అది ప్రస్తుతం అచ్చవుతూ ఉంది. ఈ కావ్యానికి జార్జి సెగారిస్ సంగీతం కూడా సమకూరుస్తున్నారు. గ్రీసులో పాల్ కోనియోఝిస్ అనే చిత్రకారుడు శేషేంద్రగారి చిత్రాలు కొన్నిటిని అద్భుతంగా గీచారు.

తెలుగు కవికి జరిగిన ఈ సన్మానానికి, గౌరవానికి, ఖండాంతర ఖ్యాతిని తెచ్చి పెట్టిన ఈ పర్యటనకు చైతన్య కవితా వేదిక సంతోష పడ్తోంది.

ఇది నాలుగో సంచిక. నాలుగు సంచికల్ని శ్రద్ధగా, అందంగా, సాధ్యమైనంత ఉన్నత ప్రమాణాలతో తీసుకు వచ్చామని నమ్ముతున్నాం. స్నేహితుల సలహాలను స్వీకరించి, మరింత జాగ్రత్తగా, ఉన్నతమైన విలువల్ని కాపాడుకుంటూ రాబోయే సంచికల్ని తీసుకు రావడమే మా ధ్యేయం. దీనికి మిత్రులందరూ సహృదయంతో సహకరిస్తారని నమ్ముతున్నాం.

కవిత్వ శక్తిని గురించి ఇటీవల (16, ఆగస్టు, 1987) 'హిందూ'లో వచ్చిన ఒక వ్యాసం గమనార్హమై ఉంది. దక్షిణ కొరియాలో ప్రభుత్వంతో పోరాడదలచిన వారు కొందరు ఇటుక రాళ్ళూ, గాసోలిన్ బాంబులూ విసరితే మరికొందరు పద్యాలు విసరుతారట. దక్షిణ కొరియాలోని ప్రసిద్ధ కవి కో ఉన్ ప్రకారం *"Poetry is the song of history."* ఆ దేశంలో కవిత్వ సంకలనాలు అమెరికాలోని డిటెక్టివ్ నవలలకన్న బాగా అమ్ముడు పోతాయట. దక్షిణ కొరియాలో ఎంతోమంది కవుల్ని అరెస్టు చేశారు, ఎన్నో సంకలనాల్ని నిషేధించారు. కిమ్ చి-హా అనే ప్రసిద్ధ కవి ఎన్నో సార్లు అరెస్టు అయ్యాడు, చివరికి ఆయనకు ఉరి శిక్ష కూడా విధించారు, అయితే ఆ తర్వాత ఉపసంహరించుకున్నారు.

ఇంతయినా రాజకీయ కవిత్వాన్ని సాహిత్య వలయాల్లో ఒప్పుకోరనే విషయాన్ని కూడా వ్యాసకర్త గుర్తించాడు. ఈ వాక్యాల గమనించదగ్గవి : *"As recently as the 1970s, most critics objected to the political messages in poems by Kim-Chi-ha and others, but these days the consensus seems to be that poetic beauty is not compromised—and may be enhanced—by making a political point."*

ఈ వాక్యాలు తెలుగు కవిత్వానికి కూడా అన్వయిస్తాయి. ఏ రకం కవిత్వమైనా కవిత్వంగా ఉండి తీరాలి గదా. కవిత్వాన్ని, కవిత్వేతరమైన దాన్ని గుర్తించడానికి చేసే ప్రయత్నంలో భాగమే చైతన్య కవిత.

సంపాదకులు

# ఇందులో......

అనువాద కవిత

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : డా. తంగిరాల సుబ్బారావు
కార్యదర్శి : డా. ఆర్వీయస్. సుందరం
కోశాధికారి , డా. సరగు కృష్ణమూర్తి
సహ కార్యదర్శి : పి. యు. బి. శర్మ

పోషకులు

శ్రీయుతులు

1. సి. ఎన్. రెడ్డి, మైసూరు
2. పి. వి. రమణయ్య రాజా, మద్రాసు
3. ఇందిరాదేవి ధనరాజ్‌గిర్, హైదరాబాదు
4. సకలా నరసింహులు శ్రేష్ఠి, బెంగుళూరు
5. తిక్కవరపు పట్టాభిరామి రెడ్డి (పఠాభి), బెంగుళూరు
6. యస్. స్వతంత్రరావు, ఐ.ఏ.ఎస్., దంపతులు, బెంగుళూరు
7. రుక్మిణి, బుల్లా సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., దంపతులు, బెంగుళూరు
8. వై. వి. వేంకటేశ్వర రావు, బెంగుళూరు
9. కె. పి. రావు, బెంగుళూరు
10. శంకరి, కల్నల్ టి. కె. మూర్తి దంపతులు, 99 ఎ.పి.ఒ.
11. బాలాత్రిపుర సుందరి, తంగిరాల భాస్కరరావు దంతులు, రాజమండ్రి
12. మార్కండపురం శ్రీనివాస, బెంగుళూరు
13. డా. జి. సుధ, డా జి. సాంబశివరావు దంపతులు, గుల్బర్గా
14. చిట్టూరి బాపినీడు, తణుకు
15. రాజేశ్వరి, సి. వెంకటయ్య దంపతులు, బెంగుళూరు
16. ఆచార్య జి. ఎన్. రెడ్డి, తిరుపతి
17. కుందుర్తి వేంకటశాస్త్రి, డా. కుందుర్తి సత్యనారాయణగార్లు, విజయవాడ

# శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ-ఒక కవితా ప్రభంజనం

సత్యం చెప్పిన వాణ్ని లోకం ఎప్పుడూ క్షమించదు. పోగా అలాంటి వాణ్ని ఉరి తీస్తుంది కూడా! కవిత్వం కాని దాన్ని ఆదరించవద్దని అరచిన సహృదయుణ్ని తెలుగు సాహిత్యంలోని మోనోపలిస్టులైన సాహిత్య వేష ధారులు ఉరితీశారు! కాని విచిత్రమేమిటంటే ఉరితీయబడినవాడు కవితా గులాబి పుష్పమై నిలిచాడు! ఉరితీసిన వాళ్లేమో ప్రచారాల మురికివాడల్లో పొర్లుతూ బ్రదుకు కాని బ్రదుకు బ్రదుకుతున్నారు! నిందలతో ఉరితీసినా, నిరాదరణతో అణగ దొక్క బోయినా, హిమాలయాలంత నిటారుగా నిల్చి, తానే-తన కవిత్వమే-ఒక ఉద్యమంగా రూపొందిన మహాకవి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారు. ఆయన రంగప్రవేశంతో సాహిత్య పీఠాధిపతులకు దిక్కు లేకుండా పోయింది. నిల్చిపోయిన కవితా సరస్వతి తిరిగి ప్రవహించడం మొదలెట్టింది. పత్రికలద్వారా 'అన్యాయ విఖ్యాతి'ని పొందిన కొందరు "కవుల"ను కవులు కాదనడం ఆయన చేసిన మొదటి నేరం. సామాజిక స్పృహ కన్నాముందు సాహిత్య స్పృహ ఉండే తీరాలనడం ఆయన చేసిన రెండవ నేరం. ఏమి చెప్పావన్నదెంత ముఖ్యమో అంతకన్నా ముఖ్యం-ఎట్లా చెప్పావన్న దాని మీద సాహిత్య విలువలుంటాయి కాబట్టి, మొదటగా సాహిత్య విలువల కోసం ప్రయత్నించాలనడం-ఆయన చేసిన మూడవ నేరం. ఆత్మాశ్రయం కాని కవిత్వం ఎట్లా ఉంటుంది? ఎందుకు అర్థంలేని వాదాలతో దొంగ వేషాలు వేస్తారు? అని ప్రశ్నించడం ఆయన చేసిన నాలుగవ నేరం. మీకర్థం కానిదంతా భావకవిత్వమనో, రొమాంటిక్ కవిత్వమనో కొట్టి పారేస్తారా-అజ్ఞాన శిఖామణులారా!-అని నిందించడం ఆయన చేసిన ఐదవ నేరం. అభ్యుదయ కవి ప్రేమ కవిత్వం రాయగూడదని ఎవడు చెప్పాడు? మయకోవస్కీ రాయలేదా? ఇంకోడు-ఇంకోడు-రాయలేదా? అని ప్రశ్నించడం ఆయన చేసిన ఆరవ నేరం. కవిత్వాన్ని కొలవ వచ్చును. అందులో ఏదో చమత్కారం

ఉండి తీరాలి. అది అలంకారం ద్వారానో, వక్రోక్తి ద్వారానో వస్తుంది. అది లేకుండా ఎంత గొప్పవాడు రాసినా ఆ రచనను ఆదరించకండి అని ఆయన అనడం ఏడవ నేరం. మార్క్స్, లెనిన్, మావో, గోర్కీ, లూనా చార్కీ, షెర్బినాలు చెప్పినటువంటి మాటల తాత్పర్యాన్నే కొన్ని సంధర్భాల్లో భరతుడు, వామనుడు, భామహుడు, దండి, జగన్నాథుడు, ఆరిస్టాటిల్ ఇత్యాదులు చెప్పారని సహేతుకంగా ఆయన చెప్పడం వారు చేసిన సప్తమ నేరం! అన్నింటికీ మించిన ఘోరాతిఘోర నేరం, పాపం-వారు చేసిందేమిటంటే- ఈ లోకానికి నిజమైన నాయకుడు కవి (వైజ్ఞానిక నాయకత్వం) తప్ప, రాజకీయవాది కాడు అని ధైర్యంగా చెప్పడం! మరి రాజకీయ మతాలకు దాసోహమన్న, అమ్ముడు బోయిన, కవులు (ఆ యంత్రాంగంనట్లు, బోల్టులు, స్క్రూలు) దీన్ని సహిస్తారా? కవికి రాజకీయాలు కావాలి కాని రాజకీయ పార్టీలు కాదంటే ఊరుకొంటారా?!

ఇన్ని నేరాలు చేసిన శేషేంద్ర శర్మగారిని సాహిత్య వేషధారులు క్షమించలేదు. నీవు రాసిందాంట్లో కవిత్వం లేదన్న ఆయనని వ్యక్తిగతంగా తిట్టారు. ఆయన జీవన విధానాన్ని తిట్టారు ఆయనను ప్రశంసించిన వాళ్లను తిట్టారు. ఆయన మీద వ్యాసాలు, పుస్తకాలు రాసిన వాళ్లను తిట్టారు. బుక్‌లెట్స్ రాసి తిట్టారు. ఉపన్యాసాల్లో తిట్టారు. సమీక్షల్లో తిట్టారు- ఇదీ సంగతి! ప్రజల పక్షాన, శ్రామికుల పక్షాన ఉండటమనే ఆయన నేరాన్ని సోషలిస్టులు కాని రచయితలయినా క్షమించగలిగారు కానీ, కమ్యూనిస్ట్ 'కవులూ' విమర్శకులూ క్షమించ లేకపోయారు! కారణం ఆ దైవానికే ఎరుక! లేక వారి పార్టీ అధిపతులకే ఎరుక!

శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారు మార్క్సిస్ట్ కవి, విప్లవ కవి. విప్లవం ద్వారానే మానవ సంఘంలో శ్రామికుని రాజ్యం, ఆర్థిక సమానత్వం వర్గ రాహిత్యం వస్తుందని గాఢంగా విశ్వసించే కవి ఆయన. రామాయణ రహస్యాలు రాసినా, శ్రీ అరవిందుల సావిత్రి కావ్యంపై సుదీర్ఘ వ్యాసం రాసినా వారి హృదయంలో మంత్రంగా మోగేది మాత్రం మార్క్స్ రచించిన 'దాస్ కాపిటల్'. అందువల్లే ఆయన రాసిన అన్ని అభ్యుదయ కావ్యాల్లోనూ శ్రామికుడే ముఖ్యుడు. వర్గ చైతన్యమే వస్తువు. శ్రామిక జన పక్షపాతం. తిరుగుబాటు, విప్లవించడం మొదలైన మార్క్సిస్ట్ అంశాలు లేని వారి అభ్యుదయ కావ్యమేదీలేదు. సిద్ధాంతలోచనాలతో జీవితాన్ని చూస్తున్నవాడు కాదాయన. జీవితానుభవంలోంచి సిద్ధాంతాలని పిండినవాడాయన. ఈ సక్రమత్వాన్ని అంగీకరించని "పార్టీవ్రతులు" ఆయన్ని వెక్కిరిస్తుంటారు! జీవితాన్ని సచే

తనంగా అనుభవించే వాడు కాబట్టే ఆయన అన్ని క్షణాల్లోనూ కవిగా బ్రదుక గల్గుతున్నాడు. ఒక్క కావ్యం రాసి రంగ నిష్క్రమణ చేయలేదు! మార్క్సిజాన్ని కవిత్వీకరించి చెప్పిన కవుల్లో ఆయన అగ్రేసరుడు. "గడచిన చరిత్రలో నాకు తావు లేదు, ఇప్పుడు నడిచే చరిత్రకు నీతిలేదు" [నా దేశం-నా ప్రజలు పు. 21]. "మీతో ఐక్యం అయితేనే నాకు మోక్షం దొరికినట్లు. మీరే నా సముద్రం. మీలోకి ప్రవహించడానికే నేను మబ్బుల్లోనుంచి అడవుల్లోనింపీ దేశం నాలుగు దిక్కుల నింపీ పరుగెత్తుకు వస్తున్నాను" [అదే, పు. 47] వంటిపాదాలు వారి అభ్యుదయ కావ్యాలనిండా ఉన్నాయి. శ్రామిక జన పక్షపాతాన్ని ఇంతగా కవిత్వీకరించిన మధ్య తరగతి కవులు అరుదు. "ఎడ్ల కళ్లల్లో కుంపట్లు రాజుతున్నాయ్. వాగటి భ్రుకుటిలో క్రోధాగ్నులు రేగుతున్నాయ్." లాంటి పాదాలిందుకు మంచి ఉదాహరణ. ధర్మ క్రోధంతో శ్రామికవర్గ చైతన్యాన్ని విపరీతంగా చూపాడీ కవి. ఆ పక్షపాతంలో హింసను కూడా సమర్థించాడీయన. "మనఉషస్సులు పాతిపెట్టి మన దేశంలోనే మనల్ని బానిసలు చేసిన వాళ్ల ప్రాణవాయువులు పీలుద్దాం పదండి" [పు. 45]. వంటిపాదాలిందుకు ఉదాహరణ. శేషేంద్ర ప్రేమకవిత్వం రాసినా, ఆయన స్వభావతః మార్క్సిస్టు. అది ఆయన రక్తనిష్ఠమైన గుణం. రామాయణ రహస్యాలను తెల్పినా, ఉపనిషత్ సంస్కారం చూపించినా, మంత్రాలను కోట్ చేసినా.......పైపైన ఇలాంటివెన్ని చేసినా........మౌలికంగా ఆయనలో ఉన్నది శ్రామికవర్గ చైతన్యం—అదనపు విలువ శ్రామికులకే చెందాలనడం—దీనికి ఇప్పటి వ్యవస్థను విప్లవించి తొలగించాలనడం. అందుకే ఆయన పాల్ ఎలార్డ్‌లాగా "ద్వేషించేవిద్య నేర్పనీండి/ద్వేషం ఎంత పవిత్రమైన వస్తువో బోధించండి(!); ద్వేషించడానికి కావలసిన స్పృహని నా రక్తంతో దానం చెయ్యనీండి" [పు. 38] అని అంటాడు. జస్టిస్ కృష్ణ అయ్యర్ ఆల్ ఇండియా బార్ కౌన్సిల్‌లో మాట్లాడ్తూ ఒకసారి తాను జీవితంలో ఎన్నడూ నవ్వలేదన్నాడు (ప్రస్తుత వ్యవస్థలో జీవనం అందుకు అవకాశం ఇవ్వదని వారి తాత్పర్యం). ఆయన ఈ మాటలనడానికి ఎనిమిది సంవత్సరాలముందే శేషేంద్ర"నవ్వు మొహాన రాసిన వాళ్లని చూస్తే నా చెయ్యి బాంబుకోసం వెదుకుతుంది;/వాళ్లకు నవ్వేంతటి సుఖం ఎలా దొరికింది? ఎవడికి/లంచమిచ్చి కొనుక్కున్నారు?" [పు. 52] అని అన్నాడు. ఈ కవి తన జీవితాన్ని ఎంత నిజాయితీతో అనుభవిస్తున్నాడో ఈ పాదాలు నిరూపిస్తున్నాయి. శేషేంద్ర ప్రబోధిస్తున్న మార్క్సిస్టు విప్లవపంథా, ఆదరిస్తున్న ద్వేషం, హింస, హింసాచర్యలు చేసేవారిని ప్రేమించడం మొదలైన వేవీ సమర్థించని ప్రస్తుత రచయిత

లాంటి మార్క్సిస్ట్ విముఖులు కూడా ఆయన భావాలవెనుకన ప్రాణంగా ఉన్న కవిత్వాంశని సహృదయంతో ఆదరిస్తారు. "కవిత్వం ఎర్రగుర్రంలా పరుగెత్తుకు వస్తోంది-రక్తంలో మునిగిన బాణంలా వీరుడు విడిచిన ప్రాణంలా" [పు. 33]. ఏ వీరుడు? కమ్యూనిస్ట్ వీరుడా? బహుశః కావాలి. కాకుంటే "చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం/రాగం కోసం బిగించిన ఫిడేలులా ఉంది./వాడినోరు పాడిన పాటలు/ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి-/బావు లేని వాణ్ని చంపిన మూర్ఖులకు/తెలీదు/ఏ మృత్తిక పువ్వును మనిషికి/కానుకగా ఇచ్చిందో, అది/వాడి నిర్మాణంలో ఉందని" [ఆధునిక భారతము, పు. 146-7] అని రాయడు. కమ్యూనిస్ట్ పద్ధతిని ఇంత ఆకర్షకంగా రాసిన కవి లేడని అనడంలో అతిశయోక్తి లేదు. వాచ్యతా భారం కింద అణగి పోయిన, నినాద ప్రాయమైన ఆభాస కవిత్వం వచ్చిన ఒక దరిద్రపు దశాబ్దాన్ని (7వ దశకం) తన కవితా శక్తితో ఒక్కడుగా బద్దలు కొట్టి అభ్యుదయ కవిత్వాన్ని, విప్లవ కవిత్వంగా రూపాంతరీకరిస్తూ దాన్ని కాపాడి పోషించి కవితావిలువల రీత్యా అన్ని వర్గాలవాళ్లూ చదవదగ్గ కవిత్వంగా దానికి గౌరవాన్ని కల్గిస్తూ ఆకర్షించిన గొప్పకవి యుగద్రష్ట శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ. ఆయన రాసిన అభ్యుదయ కావ్యాలు 1 నా దేశం-నా ప్రజలు, 2 గొరిల్లా, 3 మండే సూర్యుడు, 4, 5 ఋతుఘోష, అరుస్తున్న ఆదిమ(లలో కొంత కొంత అభ్యుదయ కవిత). వారితక్కిన కావ్యాలు 1 ప్రేమలేఖలు, 2 సముద్రం నా పేరు, 3 నీరై పారిపోయింది, 4 నేనూ నా నెమిలీ, 5 శేషజ్యోత్స్న. ఈ పది కావ్యాలూ 1985లో "ఆధునిక భారతము" అని రూపు దిద్దుకొని ప్రజల్లోకి ఒకే సంపుటంగా వచ్చాయి.

వీటిల్లో కొన్ని అనేక భారతీయ భాషల్లోకీ, ఆంగ్లంలోకి అనువాదం అయినవి. 60 సంవత్సరాలు నిండినా నవయువకుడి చైతన్యంతో తన కవితా ప్రభంజనంతో, ఉప్పెనలు సృష్టిస్తూ- అకవితని కూలుస్తూ, పాఠకలో కాన్ని ఊపుతూ వారిని తనవైపుకి ఆకర్షించుకుంటూ అవ్యాహత ప్రతిభావంతుడై అంతర్జాతీయంగా తెలుగు కవిత్వ గౌరవాన్ని నిలుపుతున్న తెలుగు కవి శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారిని-వారి షష్టిపూర్తి సందర్భంలో అభినందిస్తూ

ముదిగొండ వీరభద్రయ్య

## ప. పి. చందన్‌రావు

### పడుచు పతంగం

•

దారంతో
ఆధారంతో
అతడి చేతిలో వున్నన్నాళ్లు
హాయిగా అంతెత్తు ఎగిసింది
మురిపించింది
మైమరిపించింది
మరి ఇంతలో ఏమయ్యిందో
గాలి మారింది
నడక తీరుమారింది
అత్యాశలు ఊహించింది
ప్రక్కనున్న గాలిపటాన్ని మోహించి
అకురాయి వంటి
ఆ రంగు మాంజాదారంతో పెనవేసుకున్న
పతంగ దారం తెగి
ఇన్నాళ్లు కట్టుకుని పట్టుకున్నవాడి చేతి
ఆధారం తెగి
నేలకు జారుతోంది ఆమె!
ఆమెకోసం
ఆవారా గాలిదెబ్బలు తింటున్న ఆమెకోసం
విలువల వలువలు వొలిచేసుకున్న ఆమెకోసం
అశ్రులు బొస్తున్న కళ్లెన్నో!
మురికి గోళ్ల చేతులన్ని!
ఇక్కడ
ఆకాశానికి ఎత్తేది కొందరే
అధఃపాతాళానికి తొక్కేది ఎందరో!

(ఆమెకోసం రోదిస్తున్న ఒక మిత్రుని ఓదారుస్తూ)

# కోట్ల వెంకటేశ్వర రెడ్డి

## ఖాకీ వనంలో అంతిమశ్వాస!

ఈ వ్యవస్థ పేర్చిన చితిమీద
అనునిత్యం నువ్వు కాలిపోతుంటావు!
లోపల మరణ యాతన పెడ్తున్న ఆకలి
ఈ లోకాన్నే మింగేయాలన్నంత ఆకలి
నిదుర రాదు
తిరుగాడుదామంటే
కాళ్ళు వడి తిరుగుతాయి
ఎదురు తిరుగుతాయి
ప్రాణం గుండెల్లోంచి ఎగిసి ఎగిసి
కళ్ళల్లో కొట్టు మిట్టాడుతుంటుంది.
పేవ్‌మెంట్ మీద
దిక్కుమాలిన మున్సిపాలిటీ చంద్రునికింద
ఒంటరిగా నీవు రాలిపోయిన పండుటాకులా
గాలికి వణికి పోతుంటావు
నీ ముందు ఆకలికోపం పోరాటం చేస్తున్న బల్లి
నీ లాగే ప్రాణ భయంతో వణుకుతున్న దీపంపురుగు!
నీ కళ్ళలో ఇంతకు ముందు ఎవ్వరూ చెప్పని
ఏదో వైరాగ్య రేఖా చిత్రం వేలాడుతుంది!
ఎందుకో నీకు తెలియదు
ఒక్కసారి ఉలిక్కి పడతావ్
వెన్నులోంచి చలిపుట్టుకొస్తుంది
కొడిగడ్తున్న నీ సిక్త్‌సెన్స్ ఎర్రజెండా ఊపుతుంది
కళ్ళల్లోంచి ధారాపాతంగా నీకు తెలియకుండానే
ఉదారంగు పాయలు పాయలుగా ప్రవహిస్తుంది
అప్పుడు నీవీపుకు ఆన్చిన లాఠి
నిన్ను ఠాణా మెట్లెక్కిస్తుంది!

నీకు తెలియదప్పుడు ఆ అర్ధరాత్రే
జనాభ లెక్కల్లోంచి నీపేరు అదృశ్యమయ్యే సంగతి!
నువ్వు ధైర్యంగా సుప్రీంకోర్టు చెవులు
చిల్లులు పడేంత బిగ్గరగా 'అన్యాయం' అని అరిస్తావే
నీ కేక కంఠంలోనే సమాధి చేయబడుతుంది!
నీ శరీరంలోని అవయవాలన్నీ దగ్గరై మరీ దగ్గరై
ఓ మూలకు మూల్గుతుంటాయి!
కళ్ళు బైర్లు కమ్ముతుంటాయి
లాఠికి ఆయాస మొస్తుంది
నీకు కాసింత విశ్రాంతి
శ్వాస కాస్త ఎక్కువ తీసుకోవచ్చు.
జడ్జీ చేతుల్లోంచి లేచిపోయిన 'న్యాయం'
రంగు వెలసి అల్లంత దూరంలో
ఠాణా ముందు లాఠీ ఎదురుగా
కుర్చీలో కూర్చొని 'చీర్స్' అంటుంది
మళ్ళీ లాఠి శివతాండవం చేస్తుంది
నీ వీపు వేదిక మీద
ఆఖరు సారిగా లాకప్ ఊచలనుంచి వచ్చే
అంతిమ శ్వాస ఆగిపోతుంది
నీకు తెలియదు కాని
నిన్న కాస్తో కూస్తో మెరిసిన నీ కళ్ళు
నిజంగా గాజుగోళాలవుతాయి
చెమట పట్టిన లాఠి నుదురును
కర్చీప్ ఆప్యాయంగా ముద్దాడుతుంది
లాఠి గర్వపడుతుంది
కాలరెగరేస్తుంది
కళ్ళ ముందు ప్రమోషన్ కుర్చీ కదలాడుతుంది!
ఇదంతా నీకు తెలియదు
అదంతా నీకనవసరం కూడా!
మామూలుగానే సూర్యుడు ఒళ్ళు విరుచుకోకముందే
జనం రోడ్డు మీద పడకముందే
దినపత్రికల నుదిటి మీద

నీ మరణ వార్త మెరుస్తుంటుంది
నిన్నెరిగిన వాళ్ళంతా పాపం....ప్చ్....అని
పెదవి విరిచి ఆఖరు సారిగా
నీ మంచితనాన్ని సర్టిఫై చేస్తారు!
సానుభూతిగా
ఏ గుడిలోనో
ఏ మసీదులోనో
ఏ చర్చిలోనో
నీ ఆత్మశాంతి కోసం ప్రార్థనలు చేస్తారు!
ఖాకీ తనం గుడారు మీద
'సత్యమేవ జయతే' మాటలు
స్వకుచ మర్దనం చేసుకుంటాయి
'ఖాకీ ధర్మజుడు' శాంతి భద్రతలకు ఢోకాలేదని
పత్రికల్లో వాంతి చేసుకుంటాడు
అంతే
నిన్నటి నీ మరణ వార్త
రేపు మాకు 'మరణించిన వార్త'!

** ** **

"ఒంటెన్నం పేసి అప్పుడే
నీళ్ళు తాగేకు
ఈ ఎడారి యింకా బోల్డంత వుంది!
ఈ ఎండనూ్చసి గుండెలు బాదుకోకు
ఎప్పటికైనా చల్ల బడుతుంది!" —ఆరుద్ర

## రావి రంగారావు

### బాధ

బాధల హిమాలయాలెక్కి చూస్తుంటే
అడుసులో గిలగిలా కొట్టుకుంటున్న
చేప పిల్లలా నా దేశం

గుళ్ళల్లో మంటలు వెలరేగుతున్నా
నోరు మూసుక్కూర్చున్న ఫైరింజను ప్రభుత్వాలు
రాజకీయాలు కలిసే సరికి
నదుల నీళ్ళకెన్నో రంగులు
చీకటి అడవుల్లోని మీసాలు మెలేస్తున్న పులుల్ని తగలేసే
దావాగ్నుల జవ్వనం నడుముల్ని విరగ్గొట్ట జూచే లాఠీలు

నిజంమీద ఆయుధాలు ఝళిపిస్తున్న పచ్చనోట్లు
ప్రజాస్వామ్య పడతికి శిరోముండనాలు
అవినీతి అనారోగ్యానికి నిలయాలైన ఆఫీసుల ఒంటిమీద కట్టుకొన్న
తాయెత్తుల్లాంటి జాతీయ నాయకుల ఫోటోల్లా
మనుషులు తమ ముఖాల మీద
తగిలించుకుంటున్నారు చిరునవ్వులు

వేకువనే పుట్టుకొచ్చిన పేపరు పసికందు చెపుతుంది
పట్టపగలు పండగల గుండెల్లో కత్తిదిగిందన్న వార్తలు
అధికారం పులితోలు కప్పుకొన్న గాడిదల రంగు బయట పడకుండా
పరిస్థితి అదుపులోనే వుందంటున్న రేడియో చిలకలు........

మన మనస్సు ఒంగారం అయినప్పుడు
బాధాగ్నుల్లో కాలుతున్నా లెక్కలేదు
విలువైన ఆభరణాల్లాంటి ఆచరణను
ఆగామి వ్యవస్థ మెళ్ళో అలంకరించేందుకు.

# కలచవీడు మురళీధర్

## శిల శిల్పమై....

ఆ సొగసుకు కవితను ఇస్తే
వెదురు వేణువై
గాలి గానమౌతుంది
ఆ వయసుకు రూపం ఇస్తే
కల కల్పనయై
శిల శిల్పమౌతుంది
పెదవి దాటిరాని పలకరింత
అపశ్రుతుల కవ్వింతగా
మూగవేదనతో
పొగలివ రాగమై
అక్షరాలను కన్నీటితో అభిషేకిస్తుంది.
వికసిస్తున్న విరిని
ఉరి తీసినప్పుడు
ముళ్ల కిరీటం ధరించి
ఆశయాలకు శిలువ వేసుకొని
పెడదారిని రహదారిగా మార్చుకొన్నప్పుడు.
శిల్పం శిలయై
కల కరిగిపోతుంది..

## యౌవనం.

ఓ దశ తిరిగింది
చెట్ల నీడలు
సాక్ష్యం చెప్పే
తుంటరి క్రీడల్లో

ఓ దిశ మారింది
బావి లోతులు తరచిన
చిలిపి ఈతల చేష్టల్లో
ఓ ఆశ తీరింది
వేల పుటల్లో దాగిన
అక్షరాల అడవుల్లో
ఓ పదం పోయింది
సాధనకోసం సిద్ధుడిని
సారం సెలవివ్వండని
బుద్ధుడిని అడిగాను
సృష్టి రహస్యం
దాగిన దృష్టి
కొమ్మమీద వాలింది
పరుచుకొన్న
పచ్చటి ఆకుల్లోంచి
పండుటాకు రాలింది.

## జీవంలేని పాట

ఎప్పుడో మొదలు పెట్టిన పాట
ఇంకా పల్లవిలోనే సాగుతోంది
పదం పదం పరువం చిందినా
పాట మాత్రం పసందుగా లేదు
ప్రతి పదం పరిమళించి చిమ్మినా
గొంతు ముడి విచ్చుకోదు.
చక్కటి ప్రక్క వాయిద్యాలున్నా
జీరవోతున్నది గొంతు
ఆలాపన మధురంగా వుంది
అసలు పాటకే అవరోధం కలిగింది.

## 'నమ్మ'

### మేల్కొడమంటే మేగజైన్ వింపడం

ఎవరు ఆహ్వానిస్తారు మనల్ని?
ఇంద్రధనుస్సు తోరణాలు కట్టి-
తివాచీ పరిచి, పూలహారా లేసి
ఎవరు ఎదుర్కొళ్ళనేర్పాటు చేస్తారు?
గుండె రంపపు కోతలే
ఒక్క దగ్గరకు చేరుస్తాయి.
కాస్తంత విశ్రాంతికోసం
వీడ భుజం ఆసరాగా ఒరుగుతావనుకో
శరీరం మంచు ద్వీపమై
నీ వేడి హరించుకు పోతుంది.
అలసి నేలపై అలా మేనువాలుస్తావనుకో
చెదలు ఒంటినంతా శిథిలం చేసి
విన్నో గుప్పెడు మట్టిని చేస్తుంది.
కాపేపు గోడకానుకొని కళ్ళు మూస్తావనుకో
చైతన్యం ఘనీభవించి
పునాదిలో శిలయై అస్తమిస్తావు
ఘర్షణనుంచి పారిపోయి
రాజీ ఒడిలో ఆశ్రయం కోరుతావనుకో
నీ జీవిత సారంపై
ఎయిడ్స్‌లా, ఎడారి స్ఫోటకం వ్యాపిస్తుంది.
ఇక్కడ
స్పృహ అవసరం.

మనకు కత్తుల వంతెనా కొత్తది కాదు
కఠోరమైన అడవియాత్రా కొత్తది కాదు
కొత్త దళారీలు, కొత్త తలారీలు
కొత్త మేకప్‌లో మోసగాళ్ళూ కొత్త గాదు.

చావు డప్పుల చప్పుడులో
సరిగమల్నేరుకునే వాళ్ళు
అలంకార బరువుల్ని మోసి
ఆయుస్సు కోల్పోయిన వాళ్ళు
సినిక్కులు! గారిడీగాళ్ళు
సాహిత్య బేరగాళ్ళూ కొత్తేం కాదు
ఇక్కడ
చారిత్రక స్పృహ అవసరం.
రాలిపడే ఆకుల్లో కాదు
ఊడిపడే బెరడుల్లో కాదు
చిగుళ్ల గర్భంలోని విద్యుత్ పూలలో
భవిష్యత్తును ఆఘ్రాణించాలి.

నిప్పుల ఏరే మనల్ని
చుట్టుముట్టనున్నది
జైలు కిటికీ చీకటి నీడలే
జీవితం వెన్నెలను కబళించనున్నది
లాఠీలు విరిగిన చప్పుళ్ళే
నినాదాల ధ్వనిని నొక్కేయనున్నవి
అయితే ఎక్కడికి పోదాం?
విరక్తినుంచి విరక్తిలోకా?
ఏకాంతంనుంచి ఏకాంతంలోకా?
అరాజకీయంనుంచి అరాచకత్వంలోకా?
సమస్త విలువల విధ్వంసననుంచి ఆటవిక నగ్నతలోకా?
పెనం పైనుంచి పొయ్యిలోకా?!
ఇక్కడ,
మనం మేల్కొవడం అవసరం.
నివురు శిరస్సును ఖండించడం అవసరం
గుండెగుండెనా దీపాలు పెట్టడం కాక,
గుండెలపై సూర్యుణ్ణి ముద్రించడం అవసరం,
సామూహికతా భేరిని మోగించడం అవసరం.

కనుబొమ్మల్ని ముడిస్తే బాలు
కత్తులు నూరే జెండాలు
మన ఉదాసీనత, నిశ్శబ్దాలతో
కరవాలనం చేయబోంచున్నాయి సుమా!
రెప్పపాటయినా
నౌక ధ్వంసమౌతుంది.
ఇక్కడ,
మేల్కొని వుండటం అవసరం
కంటి కాగడాల్ని ఎత్తి పట్టడం అవసరం
మేల్కొని వుండటమంటే
చూపులు కదలాడడమే కాదు—
మేగజైన్ నింపడం.

* * *

"మాటలు పేర్చడం కవిత కాదు, మంత్రం తంత్రం అసలే కాదు
మళ్ళీ యీనాడు చిత్ర కవితల్నీ, అయోమయ బంధాల్నీ పునరుద్ధరించకు
నిగ్రహ ప్రగ్రహాలు లేని భావాశ్వాలని బరిమీద వదలకు
అన్నా! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి

విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని జల్లినా, అమృతం కురిసినా
అందం, ఆనందం దాని పరమావధి" —తిలక్

# మధుసూదనరావు

## మౌనరాగంలో జ్ఞానగీతం

ఇక్కడ—
ఊపిరి పురుడు పోసుకుంటుంది
చిరుగాలి కెగిరే కాగితం చల్లని
వాక్కుల పల్లవిగా పాడుతుంది
సాయంకాలం అయేసరికి
ముదిమి చొరబడుతుంది
కాగితపు మడతల్లో
ఊడిపోయిన మధ్య పేజీల్లో
రుచులు మరిగిన చేతుల మార్పిడిలో
ఒక పుస్తకం విజ్ఞాని మస్తకం
కవ్వంలా మధించిన మనస్సు అందించిన ఉషస్సు-ప్రతిపదం!
వాగ్వజ్రాలు పొదిగిన సాహితీ అంగుళీయకం గ్రంథాలయం
అగ్గిపుల్లతో ఆడితేనేగా అజ్ఞానం తెలిసొచ్చేది!
అజ్ఞానం కళ్ళారా చూస్తేనేగా మౌనరాగంలో జ్ఞానగీతం విన్పించేది.

## ఎ(డాలీ)డాల్

ఆడడానికో బొమ్మనిచ్చి
ఆటలో మైమరచిన నన్ను చూసి
ఓర్వలేక-
దాన్ని లాక్కొని
గిచ్చి గిల్లి ఎందుకు బాధ పెడతావ్?
దాన్ని ఏ సముద్రంలోనైనా విసిరేయ్!
దాని అన్వేషణకే వినియోగిస్తా
నా జీవితకాలం!

# కాళోజీ మినీ కవితలు

ఆడది కనదు
మగవాడు కనిపించడు
ప్రతి ఆడదీ ట్యూబెక్టోకామి
ప్రతి మొగోడు వాసక్టోగామా.

కుమార సంభవ
ప్రమాద మెరుగని అనవరత రతి
మన సమాజం ద్రుతగతి
వేయుచున్న ప్రగతి.

పుడితే ఏడుస్తున్నాం
కాని
చస్తే నవ్వడం లేదు నయం.

మా వోట్లకే పుట్టి
మమ్మే కాదంటె
ఎట్ల కొడక.

స్వదేశీ హస్తంనుంచి
బ్రతికి బయట పడితే కదా
విదేశి హస్తం ముచ్చట.

# ఎ. ఎస్. నాగేశ్వరరావు

## భూమి

1

వెగటు పుడుతున్న దినాల్లో
నేను అశాంతిని శ్వాసిస్తే,
వెనకబాటు జీవితంలో
నేను నిరాశను ధ్వనిస్తే
భూమీ!
నీ పరిమళం నన్ను పునర్జీవితుణ్ని చేసింది.
నేను బతుకుతున్నందుకు
నీ ఎదలో ఎదుగుతున్నందుకు
జీవితాన్ని ప్రేమిస్తున్నందుకు.
భూమీ!
నన్ను నీకు అర్పించుకోవడం తప్ప
ఏమివ్వగలను?
సూర్యుడితో బాటు తిరిగి
కిరణాలను భరించి
జీవన భారాన్ని మోస్తావు అనుక్షణం
అనవరతం.
ఎన్ని నక్షత్ర కాంతుల అనుభూతులు
త్యాగించావు?!
వాళ్ల జీర్ణదేహాలతో
నిను వెదుకుతూ చుడితే
నీ తలుపు తడితే
నీ వడి చేరితే
నిశ్శబ్దం
మౌన కేకలు
అర్థం కాని అనుభూతులతో
అసంపూర్ణ పికాసో చిత్రంలాగా అగుపిస్తావు

మోనాలిసా చిరునవ్వు సజీవం కాదుగదా!

2

మేం నవ్వుతాం
మా వెతలతో,
మేం నిట్టూరుస్తాం
మా కన్నీళ్ల చారికలతో,
మేం అరుస్తాం
నిఘంటువులు దాటిన అనుభూతులతో,
మేం గురిచూస్తాం
వసంత కాలపు పూపరిమళంతో....
మా బతుకులు వంటరివి కావు
వంటరి జీవితాలు మౌన పోరాటాలు కదా!
నీ గుండె మీద నిదుర బోయే
సత్తువ కూర్చుకుంటాం.

3

విత్తులు నాటితే కదా
మొలకెత్తేది?
ఆలోచనలు విత్తితే కదా
పోరాటాలు తలలెత్తేది?
విత్తులూ నాటాలి
పోరాటాలూ చేయాలి.
నీ కోపమే! నీ వడిలో కాస్త చోటుకోసమే॥
తల్లీ!
కాస్త శక్తినివ్వు
నేను సముద్రాన్ని
నీలి ఆకసాన్ని
పచ్చని చెట్టును
రెక్కలల్లార్చే పరిమళాన్ని
దిక్కులు పగిలి పొగిలే మెరుపు తునకను
నీ బిడ్డను.
అనుభూతుల పల్లవిలో
భయాన్ని తాగుతున్న వాణ్ని.

విను దూరం చేసుకొని
రాత్రిళ్ళు వెక్కిళ్ళు పెడుతూ
చలి రాత్రిళ్ళు చచ్చిపోతూ
కిరణాలతో బతుకుతున్న వాణ్ని.

4

భూమీ!
నీలి ఆకాశం కింద
రెక్కలు తెగిన పక్షి ఆత్మను,
పచ్చటి అడవి రాత్రిలో
వికసించిన కొండమల్లెను
దూకుతున్న సెలయేటి కింద
నలిగిన తామర తూడును....
గ్రీష్మంలో పొగిలిన
రాయలసీమ పల్లెను.
తల్లీ!
కాస్తంత సత్తువ నివ్వు
కాస్సేపు స్తన్యమివ్వు.

** ** **

"చీకటి బోనులో
సింహములా నిలుచున్నది.
కత్తిగంటుమీద
నెత్తుటి బొట్టులాగున్నది.
ప్రమిదలో నిలిచి
పలుదిక్కులు చూస్తున్నది దీపం" —శ్రీశ్రీ

## కీ. శే. దిగుమర్తి సీతారామస్వామి

### హిమాని

(అక్షయ శరత్తు సంచికలో ప్రచురింపబడ్డ 16వ కవిత తర్వాత)

17

జనోపయోగకరమైన ద్రాక్షతీగ నిష్కంటకము
నిరుపయోగమైన గచ్చపొద సకంటకము
సాధువు కన్న అసాధువు క్రూర వర్తనుడు కదా!

18

ఖరము కష్టించినను కరివలె చూడరు

19

వాడిననూ వకుళము సురభిళమె

20

మృణాళ భుక్కగు మరాళికి గల మృదుతనువు
మాంసాశియగు గ్రద్దకెట్లు లభించును?

21

నెమలి : కోకిలా! నీ గానమునకు నృత్యము లోటు
కోకిల : నీ నృత్యమునకు గానము లోటు

22

వజ్రమును కాల్చి బొగ్గును చేయవచ్చు
బొగ్గును కాల్చి వజ్రమును చేయలేము

23

వత్తగుల్ల రంగులు వేరైనను పురుగొక్కటే

24

గ్రీష్మమున తలుపు తెరచి యాహ్వానించు గాడ్పునే
శీతలమున తలుపులు మూసి ప్రజలు నిరాకరింతురు

25

వహ్ని సంయోగము వలన జలము ఉష్ణమైనను
కాష్ఠముల తగులబెట్ట నేరదు

26

నదులను నిరాకరించిన సముద్రమైనను ఎండవలసినదే

27

పచ్చని పైరునకే దిష్టిబొమ్మ యవసరము

28

ముళ్లున్నను గులాబిని జనులాశ్రయింతురు

29

కల్లునకు కంపు ఎక్కువ
తేనెకు వాసన ఉండదు

30

పెరుగు చిలికిన వెన్న వచ్చును
నీరు చిలికిన నిష్ఫలము

31

నీటిలోని గడ్డి బాగుగ పెరిగినను
నీటికి చలనము కలిగినప్పుడు చలింప వలసినదే.
గట్టుపై కొలదిగ నెమగు పచ్చిక కదలదు మెదలదు

32

మేల్కొలుపు కోడికూత కన్న
నిద్రపుచ్చు కోయిల యెలుగే జనులు వాంఛింతురు
పామరులు హితైషిని గౌరవింతురా?

33

చీకటి సహాయమున మెరయు చుక్కలు
చీకటినే చీల్చి వైచుచున్నవి

34

శరన్మేఘము చంద్రు నాచ్ఛాదించినది
చంద్రుడు దాని ధావళ్యము నినుమడింప జేసినాడు
సాధు ప్రకృతి శత్రుజనోపకృతి గదా

35

నీటిలో మునిగినను బాతు రెక్కకు నీరంటదు
ప్రపంచమునందలి పండిత బుద్ధి అంతియ

36

వాయస విరోధియగు కోకిలము

వాయసపు నీడ యందే పుట్టి పెరుగుచున్నది
వాయువిరోధియగు వలాహకము
వాయు సంయోగముననే వర్షించుచున్నది
ప్రకృతి స్వభావము అతి విచిత్రము

37

తుమ్మెద : కోకిలా! ఈ పుష్పములను చూడుము
కోయిల : కాదు ఈ చిగురులనే చూడుము

38

సురభిళ మల్లికా జీవితముకన్న
నిస్సౌరభ సీమంతికా జీవితమే దీర్ఘము

39

మృదు సహకార వల్లరి స్వరక్షణకు
ముష్కరకంటకతతి నాశ్రయింపక తీరదు

40

మేఘము స్వార్థము వీడి వృక్షమునకు నీరుపోయును
వాయువు పరిమళమున కాసపడి వృక్షమునందలి
ధూళిని తొలగించును.
ఉత్తమ మధ్యమ ప్రకృతులిట్లేయుండును

41

కోకిల బుద్ధి తీయమామిడి వైపు
కాకి మనసు జెముడు పండు దిక్కు

42

సంపూర్ణముగా వికసించిన కలువ చంద్రుని కభిముఖము
ముడిగిన తామర విముఖము
పూర్ణజ్ఞాని భగవానుని వైపు తేరి చూడగలడు
అజ్ఞుడో తలవంచుకొనును

43

కోకిలమునకు గౌరవమెందులకు?
కాకివలె ఇంటి చుట్టు తిరుగదు కనుక

44

వేగిన పిదప వేగుచుక్కకు గౌరవము లేదు

45

ప్రసవయుతమైన ప్రమదావనమైనను
పచ్చిక బయలు చేతనే భాసిల్లును

46

వాన కారు పోయిన పిదప వాయసము గూడు విడిచి పెట్టును
అవసరము తీరిన పిదప అల్పుడాప్తుని త్యజించును

47

ప్రథమతార ప్రమోదానుసంధాయకము
ఆ పై వచ్చిన చుక్కలను హర్షించు వారెవరు?
ప్రథముడెప్పుడు ప్రథితుడు

48

వెదురు హస్త సహవాసమున దండమై అందరిని హింసించును
వక్త్ర సహవాసమున వంశియై అందరిని రంజించును
న్యూనతా ఘనతలకు సహవాసమే మూలము

49

గరళము క్షీరమిశ్రితమైనను గరళమే

50

షట్పదములు సహకారముల జేరునుగాని
శాద్వలముల నాశ్రయింపవు

(పై కవితల్ని సేకరించి పంపిన ఆచార్య కొర్లపాటి
శ్రీరామమూర్తిగారికి ధన్యవాదాలర్పిస్తున్నాం—సం.)

## మాదిరాజు రంగారావు

### అగ్నినుండి మేఘమై

1

ఎత్తిన నల్లరాతి పిడికిలినుండి
అగ్నులు చిమ్ముతూన్నవి ఎగసి పైకి
స్వాతంత్ర్యం తేజమై
వేగంతో తీవ్రమై
పదును తెస్తోంది క్రియా రూపానికి.

స్వేచ్ఛ నినదిస్తోంది దేశసీమలు దాటి
మానవత కిస్తో చరిత్రలో విలువల్ని
జాతి వర్ణ భేదం లేని
అంధకార తత్త్వం లేని
సమభావం నవరాగం స్పందిస్తూ అందిస్తూ.

తెలుపు లేదు నలుపు లేదు ఏ భేదం లేదు.
వెరపు లేదు వెలుగు తప్ప ఏ వర్ణం లేదు.
మానవులంతా సోదరులే
మానవతా రాగం ఒకటే
ఇది మరచిన ఉదయం ఒక విషాద కావ్యం

త్యాగ పతాకతో దూకే ఒక బెంజమన్ మొలాయిస్
సాహస శక్తితో సామాన్యులు అగ్నితోరణాలై
అందరిదీ ఒకే చిర లక్ష్యం
దేశ చరిత్రలో నవస్వప్నం
నిరసనం ప్రతిఘటనం పోరాటంతోరణితం!

నిశ్శబ్దం గర్భంలో ప్రేలుతోంది శబ్దం
నిశ్శబ్దం అంచుల్లో మండుతోంది శబ్దం
చీటలు వారిన ముఖంతోను

లోయలు ఏర్పడి శరీరాన;
చీకటి దిగుతోంది వెలుగు గుండెపై చిత్రం!

2

గళగళంనుండి శబ్దం ఎగసి పైపైకి వీధిలో
అరుణమై అగ్నియై దూసుకొని పోతూంది గాలిలో
వెన్నెల కూడ రక్త చిత్ర మయంగా
ఇక్కడ పొందుతూంది వైప్లవ తేజం
ఇదీ రోజు దక్షిణాఫ్రికా! నిన్న వియత్నాం!
దెబ్బతిన్న జాతి ధమనుల్లో చెలరేగిన అగ్ని
కాల్చి బూది దిబ్బలను చేస్తోంది చరిత్రను కూడ
దీన్ని చూచే ఏ అభిమతీ
లేక పోతేనేం? ఎవరికీ
చూడవలసే వస్తుంది బ్రతికి ఉన్నందుకు.
తరాలనుండీ అదే శరీరం! దానిపై
అదేను గాయాలనుండి కారే రక్తమూ
దేనితో నైతేనేం బావుకు
రాళ్ళతో రైఫిల్‌తో బాంబుతో
నిప్పులు వేగే ఎదకిప్పుడు కన్నీరే వర్షాసమం.
పదపదాన శృంఖలతో జీవితం దీర్ఘదాస్యమై
కదలుతూంది ఆయుధమై అగ్నియై స్వేచ్ఛలుప్తమై
ఎక్కడ శిరస్సు వంగినా
ఎప్పుడు తమస్సు వాలినా
అక్షతమై ఆదర్శం నిలవాలి అంతా ఒకటై
ఈ తోటలో పూలలోను బిందువు బిందువులో
అంగార రూపం! జ్వలత్ ప్రభా ఉదయాశయమై
వెనుకనే ధైర్య సముద్రం!
కణకణంలో రసరాగం!
మానవతా సందేశంతో ఉంది పైన మేఘం.

# తంగిరాల సుబ్బారావు

## నడచి వచ్చిన దారి
(క్రిందటి సంచిక తరువాయి)

21

విశ్వవిద్యాలయ పరీక్షల ముళ్ల డొంకలు
విద్యార్థి వసతి గృహాల గచ్చపొదలు
పరీక్షా నియంత్రణాధికార పదవీ కీకారణ్యం
చీమలు దూరని చిట్టడవులు దాటి
కాకులు దూరని కారడవులు దాటి
గ్రద్దలు దూరని పెద్దడవులు దాటి
'కలుబుర్గి'లో కాలు పెట్టి
నల్లులు కుడుతున్న సింహాసనం మీద కూర్చుని
ముళ్ల కిరీటంతో మూడేళ్ల పరిపాలన
శుక్ర మహర్దశ
క్రొత్త వాహనం
అపరిమితమైన అధికారం
దాస దాసీ జనం
కనుసన్నలలో మెలిగే జనం
పంచమకారాల కత్తుల బోనులోంచి
పీకలు కత్తిరించుకోకుండా బయటపడిన నేర్పు
కేవలం దైవ సహాయంవల్ల ఒనగూడిన ఓర్పు

22

పదిహేను వేలతో తేలిన పెద్దపిల్ల గాంధర్వం
వర్ణాంతరం, జాత్యంతరం, భాషాంతరం
అంతరాంతరంలో జీర్ణించుకుపోయిన
అంధ విశ్వాసాల మూలుగు....
అభ్యుదయ భావాల జోలపాట
కల్‌బుర్గి కరువు సీమలో

జిత్తులమారి నక్కలు
విశ్వాసంగల కుక్కలు
వేళకి అన్నం విడిచి, నిద్ర విడిచి, సుఖం విడిచి
నడ్డి విరిగేలా
అహోరాత్రాలు ఏకాంత సేవ
రొమ్ము సేవ, నడ్డి సేవ
పరీక్షల చౌడమ్మ జాతరలో
కాపీల ఖడ్గపద్యాలు
స్క్వాడుల తొగట వీరులు
పిస్తోలు లేని యస్. ఐ. ని
నా వెనక తుపాకులులేని పోలీసులు
'అసి లేని సేన' అధ్యాపకులు
వీరభద్ర నృత్యాలకూ
శివతాండవాలకూ
కన్నమదాసు భైరవ కత్తినీ
బీరినీడి కొంగవాలు కత్తినీ
రక్షణ చేసుకుంటూ
నెత్తిమీద గరగతో
కత్తిమీద సాము
అధికారం పూనకంతో
మూడేళ్ల చిందు
నా జీవయాత్రలో
అది ఒక మత్తుమందు!

23

శంఖ చక్రగదాఖడ్గాలూ
కేయూర కిరీట వజ్ర సింహాసనాలూ
దివ్యచ్ఛత్రాలూ, వింజామరలూ
వైతాళికుల బహుపరాకులూ
'కలయో వైష్ణవ మాయయో' అని భావిస్తూండగానే
క్షణంలో కరిగిపోయి
అధికారమంత్ర నగరం మాయం కాగా
తిరిగి బెంగుళూరులో మోపిన కాలు

బ్రతకలేని బడి పంతులే మేలు.
తలెత్తి చూస్తే
తలక్రిందులైన ప్రపంచం
ఛిన్నాభిన్నమైన నా బొమ్మరిల్లు
ఇసుకలో పిచ్చుకగూడును కూల్చిన వెల్లి
అరే బద్మాష్!
నా పాత సింహాసనం మీద
ఎక్కి కూర్చున్న ఈ దుర్మార్గుడెవడు?
విరటుని సీటులో కూర్చున్న కంకుభట్టయితే
సహించి నమస్కరించ వచ్చు
కాని వీడు
వట్టి పేరిగాడు
ప్రతాపరుద్రుడు ఢిల్లీనుంచి తిరిగి వచ్చినా
సింహాసనం దిగని గూని చాకలోడు
పొట్టచించినా అక్షరం ముక్క లేని శుద్ధమొద్దు
జిత్తులమారి ఇంద్రజిత్తు
లంచాల మాయాబజారులో
అధికార శశిరేఖను
చేపట్టదలచిన లక్ష్మణకుమారుడు
సాహిత్య గోగ్రహణంలో ఉత్తరకుమారుడు
జారుడు చోరుడు కడుక్రూరుడు
నోరు విప్పితే అబద్ధం
నోరు మూస్తే కుతంత్రం
రెంటికి చెడ్డ రేవడిలా
ఆశ్చర్యంతో
గ్రుడ్లప్పగించి చూస్తున్న
నేను........
క్రమంగా
పాపం పండి—
నల్లటి నక్క మొగంతో
గోదావరి గట్టున
కోటిలింగాల రేవులో

కూర్చున్న
ప్రేతకళ ముసురుకున్న
శవాలు మోసే
ఆకలి చూపుల
బక్క బాపనోడు!
పాపాల సర్పవిషం
బాగా ఎక్కిన బాహుకుడు!
'అసత్య హరిశ్చంద్రీయం'లో
కాటికాపరి!
'రక్త కన్నీరు'లో లాస్ట్ సీను!
ఒళ్ళంతా పుళ్లు రసి చీము నెత్తురు
ముక్కులోంచి కారుతున్న చీమిడి
చుట్టూ ఏడు మైళ్ల
గుప్పున వ్యాపించే కుక్క చచ్చిన గములు కంపు........
దురద దురద దురద
కీర్తి దురద డబ్బు దురద
అబద్ధాల దురద మోసాల దురద
ఒకటే దురద........
గోకుడు గోకుడు గోకుడు
అమ్మవారి హారతి పళ్లెంలోంచి
ఏడువేలు ఎత్తుకు పోయిన చేతులతో గోకుడు!
పాపిష్టి దేహం రైసుమిల్లు గది గొట్టంలోంచి
చిమ్ముకు వస్తున్న చిట్టూ తౌడూలా
చుట్టూ రాలుతున్న
రాసుల రాసుల పొట్టు.
చెక్క బండిలో కూర్చుని
ఏసు ప్రభువుమీద పాట పాడుతున్న
కుష్ఠురోగి మధ్యలో పాట ఆపి
నాతో పందెం కడుతున్నాడు:
"యతో ధర్మస్తతో జయః" అంటూ........

24

తీరిన కోరికలనుంచి తిరిగి మొలిచే
తీరని కోరికల రావణాసురుని తలలు
ఆశల మేఘమాలికలలోకి
ఎగిరి పోవాలని చూసే
ఊహల రెక్కల టపటపలు
అయినా పంజరంలోనే తన్నుకుంటూన్న
జీవన పక్షి.
కాంతలనుండి కనకంవైపు మొగ్గు
కరగిపోతున్న సిగ్గు
ఎండమావుల పరిధిలో ఎగసి పడుతూ
ఆత్మగ్రహ పరిభ్రమణం!

25

ఇప్పుడు-
ఇన్ని మైలురాళ్లు దాటాక—
నాటకంలో నాలుగంకాలు ముగిశాక—
కర్మ సిద్ధాంతం మీద క్రమక్రమంగా
కుదురుతూన్న మూఢ నమ్మకం
మనం చూసే దంతా మాయ అనుకునే
ముదురుతూన్న మూర్ఖ వాదం
పూజా పునస్కారాల యోచన
భక్తి ప్రపత్తుల సూచన
పునర్జన్మనుంచి విమోచన
మధ్యమధ్య ఎక్కడినుంచో వచ్చే
కారల్ మార్క్స్ ఆలోచన
వికటాట్టహాసం
ప్రమోషన్ గురించి భయం
రిటైరుమెంటు గురించి భయం
సమస్తం దైవమయం!
మళ్ళీ దారి తప్పుతున్న బండి
దుర్భర దారిద్ర్య దృశ్యాలు
నక్సల్‌బరీ కత్తి మెరుపులు........

అయ్యో!
ఈ జీవితానికి అర్థం కుదరక
అహరహమూ ఆత్మకుహరాల్లో
ఆలోచనల గునపాలతో
అహం పెల్లగిస్తున్నాను
పాతాళంలో ఉన్న బలి చక్రవర్తిని
పైకి తీసుకు వద్దామని
పెద్ద ప్రయత్నం!
ఇది
పంచప్రాణాలూ పణం పెట్టిన
ద్యూతక్రీడ!
ఫలితం కావచ్చు పాడింటి మట్టిగోడ!
పరమేశ్వరా!
నువ్వు వెలిగించిన ఈ చిరుదీపంలో
నూనె అయిపోతోంది....
దీని గ్రుడ్డి వెలుతురులో
నీ ఉద్దేశం మాత్రం
సరిగ్గా చదవలేక పోతున్నాను............

** ** **

"నా శిలువ నేనే మోస్తున్నాను.
వధికుని వేయికనులతో వెదుకుతూ వస్తున్నాను.
భీష్మునిలా నా మరణ రహస్యాన్ని నేనే వెల్లడిస్తున్నాను.
ఉత్తరాయణం కొరకు స్వేచ్ఛామరణం కొరకు ఎదురు చూస్తున్నాను.
మరణాన్ని చూసి నాకు భయమెందుకు?
తెరచిన చెరతలుపు వంటిది మరణం
విసిగిన బాటకు క్రొత్త మలుపు వంటిది మరణం
దూరపు వలపు పిలుపు వంటిది మరణం" —బైరాగి

## రామా చంద్రమౌళి

### వెలిగించిన వత్తి-ఝళిపించిన కత్తి

ఈ జైలు ఊచల వెనుక
కళ్ళు మూసుకుంటే చాలు ఓ చీకటి లోయలోకి జారిపోతాను
మోకాళ్ళ నడుమ తలదాచుకుని రోదిస్తున్నంత సేపూ
వరదలో పూచిక పుల్లలా కొట్టుకు పోవడమే-
హృదయంలో అరణ్యాలు జ్వలిస్తుంటాయి.
వెదుళ్ళు పాటలు రాక శోకిస్తుంటాయి.
పాదాలు ఆగిపోయి నిరీక్షిస్తుంటాయి.
ప్రకృతి ఊహల నిండా మోడై విలపిస్తూంటుంది
నాలో నేను తన్నుకుని తన్నుకుని
నానుండి నేను గింజుకుని గింజుకుని
స్తబ్ధతలోనుండి, అస్థిరతలోనుండి, అచేతనలోనుండి
నానుండి నేను విముక్తుణ్ణవుతున్నపుడు
ఓ కన్నీటి బిందువు
అగ్నిధారలా జారి అభిషేకిస్తుంది—
వెంటనే
వెలిగించిన వత్తిలా-ఝళిపించిన కత్తిలా విక్రమిస్తాను
నన్ను నేను సంధించుకుని ఎగిరే పక్షినై
పునర్విజృంభణలో బయలుదేరుతాను ఆకాశాన్ని జయించేందుకు-
ఎన్నో ఏండ్ల కాలం
నన్ను తినేసి, నా జీవితాన్ని కత్తిరించుకుని దొంగిలించి
నదుల వంటి నా చేతుల్లోనుండి సముద్రాలను దోచుకుపోయింది
కన్నీళ్ళు తల్లిలా నన్ను తల నిమిరి, స్పర్శించి, ప్రశ్నించి
ఊపిరులూదుతుంటే
ఇక్కడే....జీవితానికి ఈ ఒడ్డున నిలబడి
మళ్ళీ ఆయత్తమౌతున్నాను-
నా ఒంటినిండా గాయాలై.

నా శరీరం తుప్పుపట్టిన తుపాకై
సంవత్సరాలుగా నడచిన కాళ్ళు అలసిన నాగళ్ళయి
ఒట్టి మౌనమే నరనరాన మరణమై
ఎంత స్తబ్దతను నాపై కుమ్మరించినా
ఇదిగో
మళ్ళీ యుద్ధాన్ని సాగించి జయించే
రవ్వంత ఆత్మవిశ్వాసం గుండెలనిండా నిండి ఉంది
కన్నీటిని వెలిగించి నడిపించే దీక్ష
హృదయంలో ఇంకా బ్రతికి ఉంది
సముద్రం సముద్రంలోనుండే పుట్టినట్టు
నానుండి నేనే జన్మించే
శక్తి ఇంకా నా నిండా యిమిడి ఉంది.

** ** **

"ద్రవ్యం యావత్తూ పోయింది
ద్రవం లాగా"
"ఈ నాడు వ్యాకరణంలోనే కాదు
అంతర్జాతీయ వ్యవహారాల్లో కూడా
సంధులు పాటింప బడటం లేదు"
"దంతికన్న వదంతి పెద్దది"
"తీసినా వేసినా బాధ కల్పించునవి
పన్నులు"
"ఎన్నికలలో అంతా ఓటు మాటలేను"
"దంతాలు సరిగ్గా లేకున్న
దంతవైద్యుని వద్దకు
పో పలుమారు"
"రాయి చౌదరి శిల్పి" —పఠాభి పన్‌చాంగం

## ప్రసేన్

### చీకటి ముసిరినప్పుడు

గుండెగాయం ఇజాల చెవికి చేరదు
కడుపులోనే దాచుకో—
వాడి గుండెల్లో ఫిరంగై ప్రతిధ్వనిస్తుంది
ఏసి గదుల్లో చిత్తడి చెమట
బఫే డిన్నర్లో గంజి జిగట
విస్కీ సీసాలో చిక్కని ఆకలి
లక్ష్మీదేవికి గుండెపోటు
చెమట చెట్టుకు పూసిన చురకత్తి
కడుపు శూన్యంలో అధికారపు సమాధి
వీపుమీది వాతల్లో మొలిచిన తుపాకి
కన్నీట మెరిసిన విద్యుత్తు
ఖజానా బలం ఘర్మజలం
నీ కొరడా బారెడైతే ఏం
నా దుడ్డుకర్ర మూరెడే
నోటి కూడు తన్నుకు పోయిన గద్దను
దాస్ కాపిటల్ శిక్షిస్తుందా—
గులాబి రేకులు అణుబాంబులై
వెన్నెల రేఖలు అగ్నిశిఖలై
మంచుకొండల్లో లావానదులు పుట్టాలి
ముందు ఈ చీకటి చిచ్చుకోవాలి—
అందుకే తూరుపు లోయలో దూకి
సూర్యుడ్ని వీపున మోసుకొస్తా.

** ** **

"మందులతో రాదు అమరత్వం
మరణంతో వస్తుంది" —శేషేంద్ర

# దేశెట్టి కేశవరావు

## ప్రగతి

తాజా పచ్చదనంతో మెరిసే చెట్లనీ
వంకరగా పయనిస్తూ వృక్షాల బారుల్లో
కరిగిపోయే దారినీ
జారడంలోని రహస్యం నేర్పినట్టు కొండ దిగువకు
జలజలా కేరింతాలు కొట్టే సెలయేటినీ
మార్గంలో చూశాం.
అపూర్వమైన చలిగాలి
మాకు స్వాగతం పలికింది నడుస్తోంటే
ఆకుల అరచేతుల్లో దొర్లే కీటకాలు కూడా స్వాగతం ధ్వనించాయి.
'పువ్వుల మీది మంచు కణాలు
ఆబగా ఉదయ సూర్యుణ్ణి తాగేస్తూ'
స్వాగత కిరణాలని వెదజల్లుతున్నాయి.
ప్రతి వస్తువూ స్వస్థానంలోనే వుంది.
రోజాపొదలు వేరూని.
పరిమళాల భుజాలపై చెయ్యేసి
నిలబడ్డాయి.
కనకాంబరం పువ్వుల ఉదయం
కలల్ని నేలకి ముడిపెడుతున్నది.
మేఘాలు సైతం కొండకొసలకి కట్టుబడి పోయాయి.
నిశ్చలమైన యీ ప్రపంచంలో
మేం చేస్తోన్న ప్రయాణం
ఘోరమైన అపరాధమనిపించింది.
మెల్లగా నడుస్తున్నాం.
గణనకి రాని యీ ప్రయత్నమే
మాలో చైతన్యం వుందని
తెలియజేసే గుర్తు.
శిఖరమింకా దూరంగానే వుంది.

# అడిగోపుల వెంకటరత్నమ్

## కొత్తనీరు

వాన కురిసింది
పాత సీసాలో
కొత్త మందులా
నది గట్ల మధ్య
నీరు పారుతూంది!
నదిగట్లు నీటికి
నాటినుండి నేటికి
చరిత్ర వినిపిస్తున్నాయి!
చూడు చూడు మాపై
బౌద్ధమత వ్యాప్తికై
బుద్ధుని పాదస్పర్శలు
విజయ కేతనం చేబూని
నాటి రాయలు
తిరుగాడిన గుర్తులు
స్వాతంత్ర్య సమరాన
అశేషజన రక్త తర్పణలు
పశుత్వానికి బలైన కన్యల
ఆక్రందనలు, ఆత్మహత్యలు
క్షుదార్తుల మరణాలు
విద్రోహుల స్వైర విహారాలు
అంటూ
ఒక్కొక్కటి వల్లిస్తున్నాయి
ఈ కాడుతూ ఉరకలు వేస్తున్న
కొత్త నీరు
విప్లవిస్తుందో
సముద్రంలోనే
విశ్రమిస్తుందో........

# ఆర్. సీతారామారావు

## మెరిసే చీకటిలో స్వగతం

అక్కడ
ఆ చీకటిలో ఎవరో నవ్వుతున్నారు
ఇక్కడ
ఈ వెల్తురులో ఎవరో ఏడుస్తూకూడా
కన్నీటి పూలల్లో శవం మొలిచి
మిగిలిన శవాల్లా ముసుగులు తొడుక్కొని వెళ్ళిపోయింది
ప్రేయసి విసిరేసిన మొండికత్తి
దాని వీపుకు వేలాడ్తూనే ఉంటుంది.
ఊదా నెత్తుటి బొట్టు కనుపాపల్లో
మరుగుతూనే ఉండవచ్చు
గుండెను చెంచాలోకి వొంపి
దాని ముందు అమాయకంగా పెట్టారుగాని
అదొట్టి వృషణాల్నే నములుకు తినేయగలదు
నా చిటికెన వేలుని ఎవడు మింగాడో
ఇప్పటికైనా చెప్పమనండి
వాడి కడుపులో వీణలూ వయొలిన్లూ
గొంతు చించుకుంటాయి
వయొలిన్తీగ మీద పడిపోకుండా నడిచే
నా చిటికెన వేలు శ్రావ్యంగానే పాడగలదు
తీగల గొంతు మీద గొంతు కూర్చుని
పిల్ల కాలువల్ని మహా సముద్రాలుగా మార్చుకుని
విఫలమై పోతున్న కెరటాల విషాదముఖాల్ని
తిలకించడానికి నా వాయులీనం మీద పోతాను
కమానుతో నా గొంతునే తెగ్గోసుకుని
ఒక్కో గీతాన్ని బైటికి తీస్తాను
ఆ చీకటిలో నవ్వినవాళ్ళూ

ఈ వెల్తురులో ఏడ్చేవాళ్ళూ
నా చుట్టూ వేరి కేరింతలు కొడతారు
అందరి కళ్ళలో నేను ఖైదీనయిపోయి
దేశికావారిలాగా లాలస ఉన్నా లేకపోయినా
ఒహటేలా బతుకుతా
కాకపోతే
అప్పుడప్పుడూ అమృతాల్తో సంభోగించి
చీకటిలోయల్లో నడిచి పోతాను.

*　　*　　*

"రాలిన పండుటాకుల మధ్య
మూలుగుతున్న పసిమి
చెట్టు గుండెలోకి చొరబడుతుంది.
చివరి మూలుగు
చిగురు భాష తొడుక్కుంటుంది.
చెట్టు ప్రసవిస్తుంది
పూల కళ్లనూ పళ్ల గుండెలనూ.
గాలి పాడె మీది నుంచి
ఎండుటాకుల శవాలు
నేలలోకి దూకుతాయి.
చచ్చిన ఆకులు మురిగి మురిగి
పచ్చని మొక్కలకు ప్రాణం అరువిస్తాయి
పంటను మేసి హరాయించుకున్న నోళ్లు
పడిపోతాయి నురగలు నురగలుగా.
మట్టిలోంచి లేస్తాయి ఆ నోళ్లు
మౌనాన్ని అయిదు భాషల్లో ఊదుతూ"

—సి. నారాయణరెడ్డి

## బి. అయిలయ్య

### చీకటి నీడలు

కన్నీటి కాలువల్లో జారిపడి
ఊపిరి కోల్పోయిన వాడ్ని మీరు చూసే ఉంటారు
మన మధ్యన తిరిగిన రోజుల్లో
వాడి కళ్ళు వర్షించేవి కావు
లోలోపలి వేదనలన్ని చేతుల్తో
కెలుక్కునే వాడు కాదు
పెదాలమీద ఫిలసాఫిస్టికేటెడ్ నవ్వుల పూలు పూయించాడు
పేగులు ఆకలి కళ్ళు అతికించుకుంటే
ఆ కళ్ళలోకి ఇరానీ టీలు చిమ్మేవాడు
నిత్యం శవంలా కనిపించినా—
శ్మశానంలో తిరిగినా వాడెప్పుడు భయపడ్లేదు.
ఆవాల డబ్బాలో వాళ్ళావిడ చిన్న పేగు
కత్తిరించి వేస్తే ధైర్యంగా దాన్ని
తాకట్టు పెట్టి రెండు పొట్లాల తెల్లపురుగులు
తెచ్చుకున్నాడుగాని
వాడప్పుడూ భయపడ్లేదు.
పాత బస్తీలో మతం బొడ్లో మడత కత్తులు
దోపుకున్నప్పుడు
తుపాకీ ఖుర్కీలు అడవుల గుండెల్లోకి
దిగబడ్డప్పుడు
గోండుల అంగాలు అన్నలనేవాళ్ళు
కసిగా నరికేసినప్పుడు
అజ్ఞానంతో అసహ్యించుకోని
ఆనందంగా నవ్వుకున్నాడు
బతుకు చౌరాస్తాలో వాడి స్వప్నం
ఒకటో నంబరు బస్సు కింద పడి

వెల్లా వెదురై పోయింది.
ఓపిగ్గా ఆ శకలాలని ఏరుకొని
జేబిలో వేసుకున్నాడు తప్పితే
ఇంతగా బెంగపడ్లేదు.
వాడు వాడటం మరిచిపోయిన
నిరోధ్ బుగ్గల్ని మొహంమీద పిల్లలు
ఊదేస్తున్నా వాడికేమీ కాలేదు
మరిప్పుడు
వాడెందుకు కన్నీటి కాలువలో
శవమై తేలాడు?
నిన్నో మొన్ననో
విమానాశ్రయం బుగ్గల మీద
విరహంతో అరబ్బు అడుగులేస్తూ వొచ్చాడు
వాడి హైందవి
మానానికి పెట్రోడాలర్
సిగ్గు బిళ్ళలు కట్టాడు
విస్కీ గలాసులో తేల్తున్న మల్లెపువ్వు
వాడి భార్య—
హొటేల్ గదుల్లోని
నగ్న రహస్యాల రీలు
కాలం తెరమీద
కదలాడ్డం చూశాడు వాడు.

** ** ** **

"మట్టిలో సూర్యుడు శవాన్ని పూడ్చడానికి
గుంట తవ్వినట్లు నీడ.
ముంగిలినిండా బంగారపు ఎండ
అరచెయ్యి రంగు ఎరుపు.
శిలువ మోసుకుని సులభంగా కొండ ఎక్కిన
వైరాగ్యపు జ్ఞాపకాలు.
అతని బాధల గాథలు మళ్ళీ ప్రారంభమవుతాయనే భయం"
—జేమ్స్ కర్కప్

# వి. వీరాచారి

## కాలం శిలమీద

కలల కన్నీళ్ళు కాలం శిలమీద
బొట్లు బొట్లుగా పడుతున్న
చప్పుళ్ళు
వెదురు గొంతు రంధ్రాల్లోంచి
విలిపి గాలి పలికే రాగాల
రోదనలు
కొమ్మనుండి రాలిపడ్డ
పూల, ఆకుల వేదనలు
ఉరేసుకున్న శిశిరాలెన్నో
ఊహించ లేక పోతున్నాను.
చెదిరిన స్వప్నాల మేఘాలను
తెగిన ఆశయాల రక్తపు మడుగుల్లో
ప్రతిబింబాలుగా చూస్తున్నాను
నేస్తం!
ఎన్నాళ్ళు ఈ నిర్వేదం
చీకటి ఉక్కుపాదాల క్రింద
వెలుతురు నలిగి చిట్లిన రక్తపు మరకలు
ఇంకా ఆరలేదు
రాజకీయ ప్రమిదలకు మానవత్వం
శలభంలా రెక్కలు కాల్చుకొని
కొట్టుకొంటుంది
గోడమీద నినాదాలు కన్నీళ్ళు కారుస్తున్నాయి
ఆ కన్నీళ్ళే వరదలై పునాదుల్ని కదలిస్తాయ్
అప్పుడు కాలెండర్ పేజి తిప్పుతాను
నూతనత్వాన్ని ఆహ్వానిస్తూ
మానవత్వపతాకాన్ని ఎగుర వేస్తూ.

## శిఖామణి

### అమ్మ

కన్నీరు పెట్టుకోడానికయినా
ఏదో బలమైన కారణముండాలి
అన్నంతో తీరని ఆకలిలాగో....
నీటితో తీరని దాహంలాగో....
అమ్మ జ్ఞాపకాని కొచ్చినప్పుడల్లా
నేను ఎక్కడెక్కడికో వెళ్ళిపోతాను
శరీరాన్ని వున్న చోటనే
ధరించిన దుస్తులకే వొదిలేసి
అలా అలా అలలమీద నడుచుకుంటూ
సముద్రం మీదకు వెళ్లి వెళ్లి
అక్కడో కన్నీటి సముద్రమై
నన్ను నేను ద్రవింప జేసుకుంటాను
అలా పువ్వుల మీద నుంచి
పుప్పొడుల మీద నుంచి పాక్కుంటూ వెళ్లి
వెలుతురు సోకని చీకటి దుర్గమారణ్యాలగుండా
ప్రయాణించి ప్రయాణించి
ఎక్కడో ఊపిరాడని చిక్కని చీకటిలో
చీకటిగా నిలుచుని పోయి
నన్ను నేను ఘనీభవింప చేసుకుంటాను.
అభిశప్తమైన ఆత్మల మీద నుండి
అణగారిన అగ్నుల మీద నుండి
ప్రవహించి ప్రవహించి
చివరికి ఏ చీకటి అగాథంలోనో
గుప్పెడు బూడిదగా రాశీభూతమై
దిక్కులు చూస్తుంటాను.
అక్కడ అమ్మ

సముద్రం మీద చందమామై
ధవళ శీతల మయూఖాంగుళులతో
ప్రేమగా నా వొళ్ళంతా నిమురుతుంది.
అక్కడ అమ్మ
అరణ్యంలో పులుగుల ఎలుగుల్లో తన గొంతు కలిపి
నన్ను పిచ్చిగా పిలుస్తుంటుంధి.
అక్కడ అమ్మ
సగర పుత్రులను శాప విముక్తులను చేయడానికి
భగీరథుడు తీసుకొచ్చిన గంగలా
ఒక ప్రచండ వాయుతరంగమైవచ్చి
నన్ను కేల ధరించి
తనతో పాటు తీసుకెళ్ళి పోతుంది.
అమ్మ జ్ఞాపకాని కొచ్చినప్పుడల్లా
సిరియాళుని తల్లి గుర్తుకొస్తుంది నాకు
భక్తిని ప్రకటించడం కోసం
ఆమె కొడుకును చంపుకుంటే
ఇదేమిటి?
ప్రేమను ప్రకటించడం కోసం
తను చచ్చిపోయింది నా పిచ్చితల్లని.
ప్రతీరోజూ ప్రతీపూటా అన్నం ముందు కూర్చుని
ఆకలితో ముద్ద నోటికందించ బోతానా
అప్పుడూ అమ్మే గుర్తుకొస్తుంది.
తొమ్మిది నెలలుగా
నులివెచ్చని రక్తస్పర్శతో నన్ను కాపాడిన
రక్షణ వలయాన్ని ఛేదించుకుని
ఆయుధాలు కోల్పోయిన అభిమన్యుడిలా
నేను ఈ భూమ్మీద పాదం మోపిన
ప్రథమ క్షణంలో
అప్పుడు నేను ఏడ్చింది ఆకలి కోసమే కాని
అమ్మకోసం కాదని తెలుసుకున్నప్పుడు
శరీరంలోని రక్తపు అణువణువూ
నిలువునా నీరయిపోయింది.

చేతిలోని అన్నపు ముద్ద
లుకలుకలాడుతున్న పురుగుల ముద్దయింది.
అంత బాధ పెట్టినా
అమ్మ నన్ను కోపగించుకోలేదు
ఎన్ని రక్తకణాలను కూడగట్టి
పాలపొంగుగా పోగు చేసిందో
అమృత కలశం లాంటి
గోరువెచ్చని స్తన్యాన్ని నోటికందిచ్చింది.
అమ్మ నాకు
జీవితాన్ని ప్రసాదిస్తే
నేర్పని విద్యకు
గురుదక్షిణ కోరిన ద్రోణునిలా
అమ్మ చావును
వరమడిగిన శాపగ్రస్తుణ్ణి నేను
ఇప్పుడు నాకు నెలల శిశువునై పోయి
బాల భరతుడు
సింహాలతోనూ, ఏనుగులతోను ఆటలాడినట్లు
అమ్మ వక్షస్థలం మీద ఆడుకోవాలనుంది.
ఆడి ఆడి అలసి సొలసి
అక్కడే నిద్ర పోవాలనుంది.

** ** ** **

"నాకోసం ఒక మరణగీతం పాడు
నాతో తీసుకుపోతాను
సమాధిలోకి.
సమాధి అందంగా ఉంటుంది
అయినా ద్రాక్షాసవం ఉండదు
అందుకే ఒక మరణగీతం పాడు
నాతో తీసుకుపోతాను
సమాధిలోకి."

—తోగో (ఆఫ్రికా) జానపద గేయం

## ఆర్వీయస్. సుందరం

### కందుకూరి రాయని ప్రహసనం

నేటి భారతం ఇతిహాసం కాదు—ప్రహసనం
పుటపుటకూ మధ్య మోసం-జూదం-కాపట్యం తాలూకు
నల్లటి నీడలు
ట్రాజడీల మధ్య కామిక్ రిలీఫ్‌లాగా
పవిత్ర భారతంలో నవ్వులాటలు—ఇంటర్వ్యూలు.
పీఠాధిపతుల బోధనల కత్తుల బోనుల్లోంచి
తప్పించుకుని
డిగ్రీలు చంకలో పెట్టుకుని
ఇంటర్వ్యూకు పరుగెత్తే నిరుద్యోగికి
ఉద్యోగపర్వంలో మొదటిసారి ధృతరాష్ట్ర దర్శనం
పక్కన ఒక్కొక్క కుర్చీలో గాంధారి.
ఆదిపర్వంలోనే నిర్ణయమయ్యే పదవులకు
ఉద్యోగమొక వ్యర్థ ప్రయత్నం
ప్రకటనకు ముందే నిర్ణయమయ్యే
ఉద్యోగాలకు
ఇంటర్వ్యూలొక దండగ.
తలవంచుకుని వచ్చి
తలవంచుకు వెళిపో నేస్తం
యంత్రాలు కొద్దీ వుంటే మత్స్యయంత్రం తగలకపోదు
నలుగురితో బాటు నీకూ ఫలం దక్కకపోదు.
ఏదో విరుద్యోగం దొరికిందా
కలం వదిలెయ్ బలం సంపాదించు
బోధివృక్షం కిందనే కూర్చుంటానని మొండి కేశావో
నీ మీద ఆకులు కాదు కొమ్మలు రాలుతాయి
ఉన్న ఆసక్తికి ముక్తి తప్పదు.
నీ జీవితంలో మరో ఇంటర్వ్యూకు వెళ్ళకు

బోనులో ముద్దాయి నిల్చుంటాడు; నువ్వు కూర్చుంటావు
న్యాయం మాత్రం నీవైపుండదు
తెలివిగల అభ్యర్థిని ఎలాగైనా ఫూల్ చెయ్యాలనే కుతంత్రం
ఇవ్వని ఉద్యోగానికి సవాలక్ష యక్ష ప్రశ్నలు
చివరికి వరమిచ్చేది ధర్మమూర్తి కాదు
ఇవ్వబడేవాడు ధర్మరాజూ కాదు
పాలిచ్చే ఆవుకు పొదుగుకోసే పెద్దలున్నంత కాలం
సత్యం వధ ధర్మం చెర
ఈనాటి ఆచార్యులు ప్రవీణుల వేళ్ళని కాదు చేతుల్ని నరికిస్తారు
సాధనను వేదనగా మారుస్తారు.
అందువల్ల
ఎక్కడి దొంగలు అక్కడనే గప్‌చిప్
నీవున్న చోటే కాశి
నీవు మెట్టినయది ప్రయాగ
ఉద్యోగ పర్వంలో సంధి చేసుకున్నా
స్వర్గారోహణ పర్వంలో నీవు ఖతమయ్యేది ఖాయం
అందువల్ల గొంగళి ఎక్కడ వెయ్యబడ్డావో అక్కడే ఉండు.

** ** ** **

## తిలక్ త్రిశూలం-మరికొన్ని పాదాలు

[చైతన్య కవిత-3లో ప్రచురించిన తిలక్ 'త్రిశూలం'లో మరికొన్ని పాదాలు లోపించాయనే విషయాన్ని శ్రీ కొత్తపల్లి రవిబాబు మా దృష్టికి తెచ్చారు. తిలక్‌ను అర్థం చేసుకోడానికి ఈ పాదాలు ఉపకరిస్తాయి. 'నమ్మకు....చైనా వాడిని' అనే మొదటి రెండు పాదాల తర్వాత ఈ కింది వాటిని చదువు కోవాలి]

నమ్మకు హంతకుని యీటెని, గోతులున్న బాటని
బోగందాని పాటని, చౌ ఎన్ లై మాటని
నమ్మకు మొసళ్ళున్న సరస్సుని, మూర్ఖుడధ్యక్షించిన సదస్సుని
సినీతార వయస్సుని, మావ్ సెటుంగ్ మనస్సుని............

# తుమ్మపూడి కోటేశ్వరరావు

## కుబ్జికా పింఛము

ఆమె నడకల మధుర నాట్యములు లేక
అంచలు నెమళ్ళు అరటి సామ్యములు లేవు
మాతృతాహైన్య సస్య సంపదలు పండి
ఉరము-అరుణాబ్జకోశ బంధురము కాదు 1

బాహువులు హార్దికాశ్లేష వాంఛ లేమి
వల్లికా సామ్యము నశించి వడలిపోయె
అచట లోజూపు నశియించి అక్షులందు
అంబుధిగభీర నిశితనైల్యములు పోయె 2

కేవల మృగోచితాభిలాషా విశాల
చింతచే, వపు స్సౌందర్య స్పృహయు లేని
ఒక మహోషర క్షేత్రమై యున్నదతివ
వార్షుక నవోద బిందు సంస్పర్శ లేక
పచ్చదనములు పూయని పట్టినేల 3

ఆమె దైహిక పంచభూతాణు ఘటన
చేతనానుప్రవేశమ్ము చెంద లేదు
త్రివిధ వక్రతల్ రూపుగా దిద్దుకొన్న
స్త్రీత్వమచ్చోట విడిది చేసినది స్వామి
నీ త్రిభంగిమామూర్తి సంసృష్టి కెదురు 4

ఆమె మరుగుజ్జు కాన లతాంగి కాదు
స్పంద సుందర కామ భావనము లేక
తరళ నయనాల మృగ చకితములు లేవు
మెడయు కొస కాడ వంపులో మృదుత లేదు 5

అత్యభద్ర శ్రవణ వాంఛ నామె చెవులు
అత్యభద్ర దర్శన వాంఛ నామె కనులు
అత్యభద్ర వచోవాంఛ నామె గళము
శ్రీలు, శతపత్రములు, శంఖపాళి కాదు 6

ప్రావృడంభోధర స్నిగ్ధ రమ్య వపుష
స్మిత సితేందు మయూఖ లక్ష్మి మనోజ్ఞ
శిఖి శిఖండావతంస! వర్షించుగాత
నీల జీమూతముల్ బీటి నేలయరదు 7

"ఇదియు దోషమ్ము గావచ్చునేమొ వారి",
కంచు సెలవులు వార హసించె వెలుగు
"అదియు నీ సర్జన క్రియావిధికి నతమ"
టంచు వినయావనతమయ్యె అమలబుద్ధి 8

చనుమటన్నాజ్ఞతో సాగె శ్యామల శిఖి
యమున కెరటాల విరుపుల యందు మురళి
అహిమర్దన శ్వసన నాదాంశు వేచె
కడిమి తోపుల యీలల గాలులగుచు. 9

** ** ** **

"నీ వాక వేణుగీతి వయి నిద్దుర లేపితి వీ ప్రసుప్త బృం
దావనమున్; లతా తరువితానము "కొమ్మకు కోటి పువ్వులై"
తావులు గ్రుమ్మరించె; సముదాత్తము లీ మధుర క్షణాలు; "నే
నీ వయి నీవు నేనయి" గ్రహింతము విశ్వకళా రహస్యముల్.
నీ వాక నాట్యలక్ష్మి వయి నృత్య మొనర్చితి వీ ప్రఫుల్ల రా
జీవ వనంబునందు, నవజీవన మబ్బె సమస్త సృష్టికిన్;
తావక లాస్య సుందర పదాంకిత కింకిణికా ధ్వనుల్ చిరం
జీవములయ్యె; కల్గు రససిద్ధి యికన్ జగదంతరాత్మకున్"

—కరుణశ్రీ

# పువ్వాడ తిక్కన సోమయాజి

## సాహిత్య మందిరము

వెట్టవట్టుచునుండు వెలిమికొమ్మలతోడ
దట్టమై పెనుపొందు చెట్టు వేమ,
నిలువెత్తు మ్రాకుల నేస్తమై పెనగొని
విడని బంధములగు గడుసులతలు,
నేలపై చల్వపందిళ్లు తీర్పగా, వెల్గు
చొరనీని తలిరాకు జొంపములును,
అనిలుడర్ విద్వాంసు డవనీజ సంపర్క
మందగా ప్రబలు వాద్యముల రవళి,

తాపస విహార, మతుల సంతమసభార
మాశ్రమోపాంత, మశ్రాంత విశ్రమమ్ము,
జంతు సహజీవన వన, మనంత విపుల
శబ్ద సృష్టికి నద్ది నిశ్శబ్ద వేది!

కలకలరావముల్ బలు ఖగమ్ముల మూలములై జనింప, నా
కుల గలగ్గలలల్ తదనుకూలములౌచు ప్రతిధ్వనించు; సం
కుల మృగ గర్జనల్ ప్రకృతి గుండె నదల్చు; అటన్ చరింత్రు వ
ల్కలధరులై ఋషుల్ కఠిన కార్ముక ధారులునై కిరాతకుల్!

ఱెక్క లార్చుచు వచ్చి యొక్క కొమ్మను జేరె
కంటి కింపగు పక్షి జంట యొకటి,
ఒకదాని వెన్నంటి యొకటి యుండునె గాని
ఏకత మ్మెఱుగని వే కతమున,
వేడ్క మీరగ నొండు వేఱుకొమ్మను జేర
వెలవెల బోయి తా వెదుక బోవు
ఎటనుండొ కూయన నిటనుండి కోయని
అటనట తారాడి తటమటించు,

ముక్కు ముక్కున పుణికి గోమును రచింప
ఱెక్క లల్లార్చి తీపికోర్కిని గుణింప
పత్ర సంపుటి తెరమాటు పక్షి యుగళి
సంబరముపడు సాంగత్య సమయమందు-

తమసా స్నానమునకు జను
సుమనస్వి తపస్వి యటవి సొబగుల నెమకున్,
స్వమనోరథ నిరత పరి
శ్రముడు కిరాతుడు ఖగమృగ చయమును వెదకున్.

విచ్చియు విచ్చని విరులం
దెచ్చిన కౌతుకమున మునీశ్వరు దృష్టుల్
వెచ్చెర తనదు శరమ్ముల
చచ్చు విహగముల కొఱకు నిషాదుని చూపుల్!

ఎవ్వడెఱుగు భవితవ్యము?
చివ్వన తచ్ఛరము ద్రుమము శిఖరము దాటెన్,
క్రొవ్వున నవ్వె కిరాతుడు,
కెవ్వు మని ఖగ మొరగె భువి గిలగిలలాడన్.

రెపరెపలాడి యొక్కవడి ఱెక్కల చప్పుడు మిన్నుముట్టె, పా
దప నివహమ్మునం గల పతంగ చయ మ్మెటువోయెనో, సఖుం
డపగత జీవు డౌట పతగాంగన గుండియ వ్రస్సె, నయ్యెడన్
తపసి దురంత దృశ్య పరితప్త హృదంతర వేదనాత్ముడై!

పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
విచ్చిన చురకత్తి వ్రేటు విరజాజులపై,
హెచ్చిన గర్వాతురునకు
నుచ్చము నీచమ్ము లెట్టు లుండును చెపుమా!

శోకము మూర్తిమంతముగ జోడును కోల్పడి పిచ్చిపిచ్చిగా,
నీ కత నేర్చు క్రౌంచమున కెయ్యది దిక్కిక, నంచు మ్రోడు తా
నై కనులార గాంచిన మనమ్మున నుమ్మలికమ్ము గ్రమ్మ, వా
ల్మీకి మహర్షి వాక్కురవడించెను శోకము శ్లోక కంఠమై!

"మా నిషాద ప్రతిష్ఠాం త్వమ్
అగమ శ్శాశ్వతీ స్సమాః
యత్ క్రౌంచ మిథునా దేక
మవధీః కామమోహితమ్"

ఋషి కవియై పల్కిన యది
మృష గాదు, వ్యథావిచలిత హృద్రస కూలం
కషమున పెల్లుబికి పొరలు
విషమ్ము నమృతమ్ము తత్త్వ వేత్తల కెఱుకా!

కవితాబాలిక నేర్వ ప్రప్రథమ మోంకారాక్షరాభ్యాసమై,
కవి భావామర వాహినీ రసతరంగాంతర్గత స్ఫూర్తియై,
కవియుం, గీతయు దైవికమ్ములను తార్కాణమ్ము రూపింపగన్
స్తవనీయమ్మగు శ్లోకమయ్యెనిది అచంద్రార్క వాల్మీకమై!

సీతా మనోహర శ్రీరామచంద్రుని
రమణీయ చరిత సారాంశమేమొ?
దశకంఠ లుంఠన తత్పర మూర్తి తూ
ణీరమున్ వెడలు వాణీరవమ్మొ!
మంగళ ప్రదము రామాయణారంభ సం
సర్గ వాఙ్మంగళా శాసనమ్మొ!
ఋషియైననే కావ్య కృషి సమర్థుండను
పరమార్థ బోధక పదములేమొ?

నిప్పునన్ శీతలత్వమ్ము నివ్వటిల్లు
శ్లేష పదముల సుశ్లోక చిత్కళాంబ
బ్రహ్మ యనుమతి చిల్కిన వాఙ్మరంద
తుందిలమ్మిది–సాహితీ మందిరమ్ము!

గ్రీకు కవిత

# యానిస్ రిచోస్

## తిరుగుబాటు

ఈ వృక్షాలకు ఇంతకంటె తక్కువ జాతి ఆకాశం
తావివ్వలేదు.
ఈ శిలలు పరాయి పాదాల కింద
స్థిమితంగా ఉండలేవు.
ఈ హృదయాలు న్యాయంతప్ప మరి దేనితోనూ
సుఖించలేవు.

*    *

వాళ్ల హస్తం రైఫిల్‌కి అతికించబడి వుంది
వాళ్ల రైఫిల్ వాళ్ల హస్తానికి దీర్ఘీకరణ
వాళ్ల హస్తం వాళ్ల ఆత్మకు బహిర్గత అభివ్యక్తి.
వాళ్ల అధరం ఆగ్రహంతో కంపిస్తోంది
వాళ్ల వ్యధ వాళ్ల నేత్రాల అఖాతాల్లో
మెరుస్తోంది ఒక నక్షత్రంలా.

*    *

చెట్టునుంచి చెట్టుకు
రాతినుంచి రాతికి
వాళ్లు భూమిని దాటారు
వాళ్లు నిద్రించారు ముళ్లు తలగడగా
వాళ్లు జీవితాన్ని మోశారు ఒక నదిగా
తప్పికతో తపించే వాళ్ల రెండు హస్తాలతో........

(తెనుగుసేత : శేషేంద్ర శర్మ)

# ఒడిస్యూస్ ఎలిటిస్

## (1979 నోబుల్ బహుమానం పొందిన గ్రీకు కవి)

### శవపరీక్ష

ఇలా వాళ్ళు అతని హృదయాంతరాళంలో ఆలివ్ వేళ్ళ బంగారం
దిగబడిందని కనుక్కున్నారు.
తెల్లారే వరకు అతను కొవ్వొత్తి వెలుగులోనే చాలాసార్లు
మేలుకున్నందువల్ల అతని పేగుల్లో అపూర్వమైన సెగ మిగిలిపోయింది.
చర్మానికి కొంచెం దిగువ దిగంతపు నీలిరేఖ స్ఫుటంగా
చిత్రితమై వుంది; అతని రక్తంలో నీలి గుర్తులు.
మంచి ఒంటరితనం గడియల్లో అతను బట్టీపట్టిన పక్షుల ధ్వనులు
అన్నీ ఒకే మారు బయట పడ్డందువల్లనేమో
కత్తి లోతుల్లోకి దిగబడలేదు.
అతను ఏ చెడుపును చూశాడో–
ముగ్ధజనుల భయంకర భంగిమల్ని చూశాడో
అతని కళ్ళు తెరుచుకుని ఉన్నాయి
అభిమానం నిండిన కళ్ళు, అడవంతా ఆ నిర్దుష్ట అక్షిపటంలో ఉంది
మెదడులో ఆకాశంలోని మృత ప్రతిధ్వని తప్ప మరేమీ లేదు.
అతని ఎడమ చెవి రంధ్రంలో మాత్రం గవ్వలో లాగా నున్నటి ఇసుక.
దాని భావమేమిటంటే అతను చాలాసార్లు కడలి తీరంలో
ప్రేమ బాధతో సంచరించాడు, గాలి గర్జనతో బాటు.
అతని తొడ మీది నిప్పురవ్వలకు అర్థమేమిటంటే అతను స్త్రీని
కౌగిలించుకున్నప్పుడు గంటలే దొర్లిపోయేవని.
ఈ సంవత్సరం ఫలాలు చాలా త్వరగా లభిస్తాయి మనకు.
(తెనుగు సేత: ఆర్వీయస్. సుందరం)

జూడిత్ రైట్

## పురుషునితో స్త్రీ

రాత్రి వేళ కళ్ళులేని కార్మికుడు,
నేను పట్టుకున్న స్వార్థరహిత నిరాకార బీజం,
తన పునర్జీవన దినాన్ని నిర్మిస్తుంది—
నిశ్శబ్దంగా వేగంగా కంటికి కనబడకుండా
అనూహ్య కాంతిని దర్శిస్తుంది.

ఇది శిశువు కాదు దీనికి శిశువు ముఖం లేదు;
పేరు పెట్టడానికి దీనికి పేరు లేదు;
కాని నువ్వూ నేనూ దీన్ని తెలుసుకున్నాం బాగా,
ఇదే మన వేటకాడు ఇదే మన వేట,
ఇది మన పరిష్వంగంలో నిద్రించే మూడోది.

నీ హస్తానికి తెలిసిన శక్తి ఇది,
అర్ధ చంద్రాకారపు మాంసం అదే నా ఉరోజం,
మన నేత్రాల సరియైన స్ఫటికాలు.
అర్థం కాని ముకుళించిన గులాబీని పెంచే
నెత్తుటి అడవి చెట్టు ఇది.

నిర్మాతా నిర్మాణం ఇదే;
ప్రశ్నా సమాధానం ఇదే;
చీకటిని కుమ్మే గ్రుడ్డి శిరస్సు,
కత్తి అంచు పొడుగునా మెరిసే కాంతి పుంజం.
అయ్యో! నన్ను పట్టుకో, నాకు భయం వేస్తోంది.

(ఆంగ్లమూలంనుంచి అనువాదం—తంగిరాల)

# లీపో

## యుద్ధం

ఇది డిసెంబర్!
చూడు ఆ విషాద నయన 'యూచో' యువతి!
పాడదు, నవ్వదు, చెదిరిన కనుబొమలు సవరించుకోదు.
గేటుదగ్గర నుల్చుని
బాటసారుల్ని చూస్తూ ఉంటుంది.
తన కత్తి లాక్కుని దేశపు సరిహద్దుల్ని రక్షించడానికి
వెళ్ళిన అతడ్ని జ్ఞాపకం చేసుకుంటూ-
చైనా గోడ ఆవలి సీమల్లో శీతల వాయువుల చేతుల్లో
చిక్కి బాధ పడుతున్న అతడ్ని తలచుకుంటూ-
యుద్ధంలో ఒరిగిపోయిన వాడ్ని మళ్ళీ తిరిగి రాని వాడ్ని
తలచుకుంటూ—
పులి చారల బంగారు పేటికలో
తెల్లటి పక్షి ఈక లల్లిన
బాణాల జంట ఉంది
సాలీడి గూటి వెనక ధూళి కప్పుకుని-అప్పుడప్పుడూ
వాటిని చూచుకుంటుంది.
ప్రేమకనే శూన్యపు కలలు తలచుకుంటే గుండె నీరవుతుంది!
ఒక ఆనకట్ట కట్టి హువాంగ్‌హొ నదీ ప్రవాహాన్ని
ఆపవచ్చు కానీ
మంచు రాలుతున్నప్పుడు ఉత్తరపుగాలి వీస్తున్నప్పుడు
ఆమెలో పొంగి పొర్లే దుఃఖాన్ని
ఎవరాపగలరు?

(తెనుగు సేత: శేషేంద్ర శర్మ)

# యువాన్ షూయి-పాయ్

లండన్, న్యూయార్క్ ఇతర పాశ్చాత్య దేశాల వస్తుప్రదర్శన శాలలు

ప్రాచ్య దేశాలనుండి
పాశ్చాత్య దేశాలనుండి
కొల్లగొట్టిన సామాన్లతో
పూర్తిగా నిండిన గది.
రాతి గుర్రపు తలల ప్రక్కన
చెక్కిన బుద్ధుని చేతుల విశ్రాంతి;
స్వర్ణాభరణాలు, పింగాణి పాత్రలు
—యువాన్ మింగ్ యువాన్,
ప్రాచీన కపాలశకలాలు
—పెకింగ్ మానవుడు.
పారిసునుండి మహత్తర చిత్రకళ,
భద్ర పరుపబడ్డ ఈజిప్టు శవాలు,
వర్ణింపనలవి కాని
నగిషీ కుట్టుపనులు, కుడ్య చిత్రాలు;
నీ సొంత దేశం సాంస్కృతికంగా
నీరసంగా ఉంటే ఏం?
ఇతర దేశాల్లో చొరబడి
నీకు నచ్చింది అమాంతంగా ఎత్తుకు పో!

(సిడ్నీ షాపిరో ఆంగ్లానువాదానికి తెనిగింపు—తంగిరాల)

# ఎరికా యోంగ్

## మళ్ళీ కలం పట్టి

నువ్వూ నేనూ
మనలాంటి కవులందరూ
అనుక్షణం కవిత్వం రాసినా
ఏ ఒక్క కవితా
కోర్టు తీర్పులని తిప్పి చెప్పలేదు.
లంచగొండిని మంచిగా మార్చలేదు.
పెరిగే కేన్సర్ కవిత్వంవల్ల తగ్గదు.
పేలిన బుల్లెట్ గిరుక్కున వెనుతిరిగి
పేల్చిన వాణ్ణే కాల్చెయ్యదు.
అయినా
మనకి తెలుసు
ఈ అవక తవకలో కానికి
కర్త దేవుడు
కాడు, మనమేనని,
మనం కవిత్వం రాస్తాం,
చెట్లు ప్రాణవాయువు విడిచినట్టు—
మరి మనందరం శ్వాసించాలి కద!

(తెనిగింపు : గోదావరి శర్మ)

** ** ** **

"అప్పుడే సమర్తయిన పద్యాలతో
నీ వాడిన సరసాలకు ఎక్కడలేని అర్థభారం.
అది ప్రేమ కాదు, దురభ్యాసం, జాగ్రత్త"

—ఆర్. ఎస్. థామస్

# చికాయా యూ థామ్సో

## ఉనికి

నా దృగంచలం మీద మనుషులెవ్వరూ కనపడక పోవడంతో
నా శరీరంతో దేదీప్యమాన మృత్యుగీతాన్ని ఆలపించా-
నా నదిని నేననుసరించా అనంత బలిష్ఠశీతల కెరటాల సముద్రందాకా-
ఏకాంతాలు ఈదులాడే ఫముద్రవృక్ష ప్రపంచానికి నే బహిర్గతమయ్యా
ఏకాంతాలకి పొదలూ తుప్పలూ ఆవిష్కరించబడ్డాయి.
సూర్యుడికేసి నా శరీరం ఆవిష్కరించబడింది.
నిజమైన వీర్యం నన్ను కొద్దికొద్దిగా పరిపక్వరక్తం తిరుగుబాటులకేసి
లాగుతుంది.
మొద్దుబారిన నా వెంట్రుకలు అన్నిరకాల గాలులకి అండగా నిలిచాయి
అన్ని రకాల విత్తనాలకీ నా చేతుల తేమే.
నా పాదాలు నన్ను సమస్త ప్రదేశాల్లోకి మోసుకెళ్తాయి.
దీర్ఘకాలిక మృత్యువు తన అత్యంత ప్రభావంతమైన
సూర్యుళ్ళతో నన్ను తనలోకి పీల్చేస్తుంది.
ఒక అసత్యపుటునికి.
ఏసుక్రీస్తు నన్ను మోసగించాడు-వాళ్ళని తన శరీరంలో
మేకులు కొట్టడానికి అనుమతించి
క్రీస్తు నన్ను మోసగించాడు.
వాళ్ళు తనని మృత్యుపరీక్ష పెట్టటానికి వప్పుకున్నాడు.
ద్రోహి క్రీస్తు-ఇక్కడ నా శరీరం కంచులా తయారయ్యింది.
అసంఖ్యాక నా ఆత్మాంశలు రాగి, తుత్తునాగాలు, మెదడనే రెండురాళ్ళు-
శాశ్వతంగా మృత్యువనే సముద్రం చేప నా రక్తాన్ని గట్టిగా పట్టుకుంది.

అందమైన మొక్కల జింకల పరిమళం నన్ను బాధిస్తుంది.
పగటి పూట మందంగా ఉబుకుతున్న శబ్దాల్ని వింటున్నా-
ఉదయం మధ్యాహ్నంగా పరివర్తన చెందింది.

నా మంచి నే కోరుకునేటట్టయితే వీడ్కోలు చెప్పే సమయమయ్యింది.
అయినా చేయటానికేదన్నా పని దొరకాలిగదా—

(తెనుగుసేత: కె. శివారెడ్డి)

** ** ** **

"నా భ్రమల్నే ప్రేమించే నేను
ఎప్పుడూ నవ్వలేదంటే నమ్మండి
నేనెప్పుడూ పక్కికిలించ లేదు
నాకు సంతోషమూ తెలీదు బాధా తెలీదు
నాకెవ్వరూ సంతోషమూ కలిగించలేదు
బాధా పెట్టలేదు.
కాంగో చరిత్రను గురించి
తుఫాను ఏం చెప్తుందో నాకు తెలీదు
ఉరుములురిమితే అది ఆరంభమవుతుందా
లేక భూగర్భశాస్త్రం భూగోళ చరిత్రా కలిసినప్పుడు
ముగిసిపోతుందా
నాకేమీ తెలీదు ఏమీ తెలీదు
నా పుచ్చిపోయిన పళ్ళనే అడ్డు పెట్టుకొని
గౌరవప్రదంగా
నేను నోరు మూసుకుంటాను" —చికాయా యూ థామ్సీ

## జి. యస్. శివరుద్రప్ప

### విత్తనం నుంచి విత్తనానికి......

విత్తనం నుంచి విత్తనానికి
దీని ప్రయాణం
ఒకటి పదిగా పది వందగా
వంద వెయ్యిగా అవుతూ ఇలాగే
అసంఖ్యంగా అనంతంవైపు
దీని దారి.

విత్తనం నుంచి విత్తనానికి:
ఈ మధ్యలో ఎన్నెన్ని చెట్లు, ఎన్ని ఆకులు
ఎన్నిపూలు, ఎన్ని పళ్లు!
అన్నీ మట్టి
ఈ ఒక్క విత్తనం చివరికి మళ్లీ
విత్తన మవడంకోసం.

విత్తనం నుంచి విత్తనానికి—
మధ్యలో ఎన్నెని దేహాలు,
ఎన్నెన్ని చిగుళ్లు–కసుగాయలు–కొమ్మలు రెమ్మల పొడవునా
జోలపాటల తొట్టెల వందలాది మెట్లు
ఎన్నెన్ని రేయింబవళ్లు ఋతువుల పోషణ
ఎన్ని విధాల రసాలుగా మారి
కళ్లకు చెవులకు ముక్కు నాలుకలకు
రుచినిచ్చి, చివరికంతా మట్టికి విడిచి,
చివరికొక జ్ఞాపకమై, కన్నీరై,
కథయై, కవితయై,
లైబ్రరీ నిండా పుస్తకాలై,

మళ్లీ ఒకటి పదిగా, పది వందగా
లక్షోపలక్షలుగా, నేల మీదపడి పైకి లేచి
చెట్టు చెట్టునా తుదికెక్కి మళ్లీ విత్తనమై
వెనకా ముందూ అంతా తనలో సంధించుకొన్న బిందువై
విత్తనం నుంచి విత్తనానికి
విత్తనం నుంచి విత్తనానికి
దీని ప్రయాణం.
"అచలోయం సనాతనః"
(అనువాదం : తంగిరాల—మార్కండపురం శ్రీనివాస)

## బి. ఆర్. లక్ష్మణరావ్

### ఆ కళ్ళు

ఆవిడ కళ్ళల్లో
సముద్రముంది:
కష్ట నిష్ఠూరాల బాధల నిట్టూర్పుల
వందనదుల నీళ్ళను కలుపుకున్న
అపార సముద్రం,
పట్టిలాగే రౌద్ర
మనోహర సముద్రం.
ఘోరుమనే అలలు అలలు;
హతాశతో నురుగు నురుగు;
ఒకదాన్ని మింగి మరొకటి బిరబిర పెరిగే
కలవరం వంత చింత
చేపలు షార్క్ ఆక్టోపస్
పాములు తిమింగలాలు
కుతకుతలాడే సముద్రం.

లోతులు కొలవడానికి ధీరంగా
కళ్ళల్లో దూకాను.
మునిగాను,
మునిగాను.
మునుగుతుంటే ఇంకా
లోతు.
ఏమి ప్రేమ పాశం!
చావులాంటి
హితకరమైన కారు చీకటి,
కడుపు
పరుపు
అడుగు భాగం
చేరాను;
నిశ్శబ్దపు జోల;
అక్కడే పడుకున్నా.
తేలి
పైకెక్కి
వెనుదిరగనే లేదు.

## స్తబ్ధ చిత్రం

బయట బస్సు కారు ఆటోరిక్షాల అగడం
ఈ గదిలో అంతా నిశ్శబ్దం నిశ్శబ్దం
అస్తవ్యస్తమైన పరుపుమీద అలసి సొలసిన దేహం;
చూరునుంచి వేలాడుతున్న గుడ్డి దీపం.
నేల మీద చెల్లాచెదురుగా కాయితాలు
పగిలిన గాజులు, విడిన ముళ్ళు, తొక్కిన చిత్రాలు,
తడిసిన బుగ్గలు, శూన్యదృక్కులు, రంగు వెలిసిన పెదవి
బాధను ప్రసవించిన బిడ్డ, పక్కనే చిన్న చీటి.
మూసిన తలుపు, వేసిన గడియ, ముగిసి పోయిన వ్యథ.
పక్కనే దొర్లి పడిన చిన్న ఖాళీ సీసా.
(తెనిగింపు : ఆర్వీయస్. సుందరం)

## వా. కామరాజన్

### మనం సగటు మనుషులం

నీవూ నేనూ
మధ్య తరగతి చిగురుటాకులం
మొదటి తేదీ సాయంత్రం మైక మెక్కేవాళ్ళం
జీతం తీసుకోడంలో రైలు స్నేహితుల్లాంటి వాళ్ళం.

నువ్వు మేనకవు కాదు
అయితే నేను విశ్వామిత్రుణ్ణి

మనం
భూమి అనే త్రిశంకు స్వర్గంలో
బ్రతుకుతున్నాం ప్రియా

నువ్వు లైలావు కాదు
నేను ఖయాస్ కాదు
నీవూ నేనూ
మెరీనా బీచిలో
పిల్లల్ని మోసే ఒంటెలం
నేను నీవు పడుకునే వేళ ప్రేమికుణ్ణి
మనం సగటు మనుషులం ప్రియా!

నేనూ నువ్వూ
గ్రామంలో పుట్టి
మనియార్డర్ కోసం
నగరపు సంతలో
అమ్ముడై పోయిన
పట్టభద్రులం

యజమానుల కోసం
బంగారు గుడ్లు పెట్టే బాతులం.

మనం
ముప్పై రోజులు గౌరవ యాచకులం
ఒక్కరోజు ఏడుపుగొట్టు దానకర్ణులం
అతిథులు వచ్చినా
విందుకు ఆహ్వానం వచ్చినా
అప్పులు చేసుకునే పాపాత్ములం.

నువ్వు నా
ఆదివారం ప్రేయసివి
ఆరురోజులు జగడాల మారివి
జోలలు పాడే నారివి.

మనం
పిల్లల్ని ముద్దాడే
పాత ప్రేమ పక్షులం.
(తెనిగింపు : ఆర్వీయస్. సుందరం)

** ** ** **

తొలకరి

చుట్టూ వ్యాపించిన చల్లటి వాతావరణంలోకి
ఈ బంగళా
తన గుహలాంటి గొంతులతో
వేడి శ్వాసలు విడుస్తోంది........
(శేషేంద్రగారు 12-5-87 సాయంకాలం ఆశువుగా చెప్పిన కవిత)

# చైతన్య కవితా వేదిక

ప్రభవ శరత్తు **4** AUTUMN 1987

"నదులు కనే కలలు ఫలిస్తాయి పొలాల్లో
కవులు కనే కలలు ఫలిస్తాయి మనుష్యుల్లో"

డా. ముదిగొండ వీరభద్రయ్య
వి. పి. చందన్ రావు
కోట్ల వెంకటేశ్వర రెడ్డి
రావి రంగారావు
కలచవీడు మురళీధర్
'నమ్ము'
మధుసూదన రావు
కాళోజీ
ఎ. ఎన్. నాగేశ్వరరావు
కీ. శే. దిగుమర్తి సీతారామస్వామి
ఆచార్య మాదిరాజు రంగారావు
తంగిరాల సుబ్బారావు
రామా చంద్రమౌళి
ప్రసేన్
దేశెట్టి కేశవరావు
అడిగోపుల వెంకటరత్నమ్
ఆర్. సీతారామారావు
బి. అయిలయ్య
వి. వీరాచారి
శిఖామణి (కె. సంజీవరావు)
ఆర్వీయస్. సుందరం
ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు
పువ్వాడ తిక్కన సోమయాజి

గ్రీకు, ఆస్ట్రేలియా, చైనా, ఆంగ్ల, ఆఫ్రికా, కన్నడ, తమిళ కవితలు